బ్రహ్మానంద.

జగదానందము

రాజమహేంద్రవరము, 1928.

Record no. 159

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

బ్రహ్మానంద.

జగదానందము / బ్రహ్మానందకృతి.- రాజమహేంద్రవరము : అద్దేపల్లి లక్ష్మణస్వామినాయుఁడు, 1928.

2, (1), 3, 122 p. : port. ;21 cm.

Record no. 159

Brahmānanda.

Jagadānandamu / Brahmānandakṛti.- Rājamahēndravaramu : Addēpalli Lakṣmaṇasvāmināyum̐ḍu, 1928.

2, (1), 3, 122 p. : port. ;21 cm.

Record no. 159

35 mm microfilm

Image placement: IA (IIA) IB IIB          Date filming began:



బ్రహ్మానందకవి

శ్రీ

బ్రహ్మానందకృతి



# జగదానందము




రాజమహేంద్రవరము
శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయుడుగారిచే
సరస్వతీ పవర్ ప్రెస్‌నందు ముద్రితము.



వెల రూ 0—10—0.

**1928**

వలయువారు

ద్వివేది బ్రహ్మానందశాస్త్రి

తుని

అనివ్రాసికొనుడు

# ఇందలి పాత్రములు

| పురుషులు | స్త్రీలు |
|---|---|
| **I అంకము.** | |
| సూత్రధారుఁడు | నటి |
| సారణుఁడు | తాటక |
| జనకుఁడు | సీత |
| విశ్వామిత్రుఁడు | రత్నప్రభ |
| శౌష్కలుఁడు | |
| శతానందుఁడు | |
| రావణుఁడు | |
| రామలక్ష్మణులు | |
| ఇతరరాజులు | |
| **II అంకము.** | |
| విరాధుఁడు | శూర్పణఖ |
| పరశురాముఁడు | |
| రామలక్ష్మణులు | |
| జనకుఁడు | |
| దశరథుఁడు | |
| **III అంకము.** | |
| మారీచుఁడు | |
| రామలక్ష్మణులు | సీత |
| రావణుఁడు | |
| **IV అంకము.** | |
| రామలక్ష్మణులు | |
| హనుమంతుడు | |
| సుగ్రీవుఁడు | |
| వాలి | |

| పురుషులు | స్త్రీలు |
|---|---|
| **V అంకము.** | |
| హనుమంతుఁడు | సీత<br>ఏకజట<br>త్రిజట |
| **VI అంకము.** | |
| లోహపాదుఁడు<br>జంబుకుఁడు<br>ప్రహస్తుఁడు<br>రావణుఁడు<br>అంగదుఁడు | మందోదరి |
| **VII అంకము.** | |
| రామలక్ష్మణులు<br>విభీషణుఁడు<br>హనుమంతుఁడు<br>రావణుఁడు<br>విద్యాధరుఁడు<br>వసిష్ఠుఁడు<br>భరతశత్రుఘ్నులు | విద్యాధరి<br>సీత |

# కృతిసమర్పణము

గుణాః పూజా స్థానం గుణిషు నచ లింగం నచ వయః
(మహాకవి భవభూతి)

భువన పావన మయిన యీ రామ కథా నాటకము (జగదానందము) ప్రభవసంవత్సర భాద్రపద బహుళ త్రయోదశీ శుక్రవారమున (23-9-1927) ఇందుమతివలె దివికిఁ జన్న పతివ్రతకు నాదు సహధర్మిణికి జోగమకుఁ గీర్తిచంద్రిక లాచంద్రార్కము వెల్లివిరియునట్టు లంకిత మొసంగితి; మా ఆరామద్రావిడ శాఖా పావన సుమనోమంజరి యనఁ దగు నీమె సుగుణపుంజ మీ కృతిసమర్పణమునకు నన్నుం బ్రేరేచినది కావున నిష్కపటయు, నిర్మత్సరయు, నిర్మోహయు, శుద్ధమతియు, సువ్రతయు, శుభాచారయు నయిన మదనువ్రతకు మదనుజీవితకు, మత్సహధర్మిణికి, జోగమకు నిత్యసౌఖ్య జ్ఞానానంద కైవల్యంబుల నొసంగునట్టు లిష్టదేవతలం బ్రార్థించి గ్రంథరచనకుం గడంగువాఁడ.

ద్వివేది (వేదుల) బ్రహ్మానంద శాస్త్రి.

శ్రీరస్తు

# నవరత్నములు

శా. శ్రీకాంతామణియున్ హిమాచల కుమా । రీరత్నమున్ భారతీ
రాకాచంద్రముఖీ లలామయును ద । త్ప్రాణేశ్వరుల్ మువ్వురున్
మాకాంతామణికెప్డు జోగమకు శ్రీ । మంతంబులౌ దేవతా
లోకంబుల్ పొరయింత్రుగాక! దివిష । ల్లోకేశుణల్ గొల్వఁగన్.

శా. ఆచంద్రార్కముఁ బుణ్యలోకముల ని । త్యానందసంపత్తి రా
కాచంద్రానన భక్తవత్సల యిడుం । గాశీ విశాలాక్షి పూ
ర్వాచారప్రవణాఢ్యకున్ విబుధ కాం । తారాధ్యయౌ సాధ్వికిన్
మాచంద్రాననకున్ మదంఘ్రులెపుడా । త్మన్నోఁచుజోగమ్మకున్.

మ. బహుమాన్యల్ శచిఁదొట్టి సర్వ దివిష । త్పర్వేందుబింబాననల్
సహవాసంబులఁ జెల్మికత్తెలయి ని । చ్చల్ పుణ్యలోకంబులన్
సుహితంబుల్ వెలయింత్రుగాత! శుభముల్ । శోభిల్లజోగమ్మకున్
ద్రుహిణానంద మనీషి పత్నికి సతీ । స్తుత్యాత్మచారిత్రకున్.

సీ. తొలఁకాడుచు నపార । దుగ్ధ వాహిను లవి
యెల్ల వేళలఁ బ్రవ । హించునవియు
జర డగ్గఱఁగనీక । సతతంబు యౌవన
శ్రీసంపదలు సవ । రిల్లునవియుఁ
గడమ యేమియు లేక । కల్యాణ సమ్మోద
ములనారతంబునుం । బొల్చునవియుఁ
గొనకొని విధి విష్ణు । గుహలోకముల మీఁద
భర్గలోకము చెంతఁ । బరగునవియు



గీ. మఱియుఁ దేజోమయంబులై । మలయునవియు
నయిన పృథుపుణ్య లోకంబు । లవునుగాక!
మా మనోహారిణికి జోగ । మకుఁ బవిత్ర
గుణ కదంబకుఁ బత్యను । గుణకు నెపుడు.

సీ. పుట్టింట మెలఁగున । ప్పుడు భక్తి నెరపిన
గౌతమీ తోయావ । గాహములును
అత్తింటఁ జరియించు । నపుడు సల్పిన వసి
ష్ఠ తరంగిణీ జల । స్నానములును
తుని కేగు నపుడెప్డుఁ । ద్రోవ వంతెన మీఁద
గోదావరికి మ్రొక్కు । కొను నతులును
అన్నవరము డాయు । నపు డందుఁగల సత్య
నారాయణున కిడ్డ । నమనములును

గీ. మది సదా చేయు మన్నామ । మంత్ర జపముఁ
దోడుగా జోగమకు సతీ । స్తుతకు నాదు
ప్రేయసికి నా యుపాసించు । శ్రీధరుండు
శాశ్వతామరశ్రీల నొ । సంగుఁగాక!

శా. చైతన్యప్రదుఁ డెల్ల జీవులకుఁ దా । సాక్షాత్త్రివేదీమయుం
డాతత్వాకృతి దైవతంబు రవి గా । యత్రీప్రియుం డెప్పుడున్
జ్యోతిర్మూర్తి యొసంగు మద్రమణికిన్ । జోగమ్మకున్ సాధ్వికిన్
వీతాపాయములై వెలుంగు దివిష । ద్విఖ్యాతలోకంబులన్!

సీ. అష్ట మూర్తులయందు । హరునకుఁ దా నొక
మూర్తియై వెలుఁగొందు । మూర్తివాఁడు
సమ్మోద రస విని । ష్యందమై యమృతంబు
నిండారఁ గురియు వె । న్నెలలవాఁడు

రహి దక్షసుతల । కిర్వదియేడ్వురకు మనో
హారిసై మురియు సో । యగమువాఁడు
రాజసూయము జగ । త్త్రియము దక్షిణ యిచ్చి
సలిపిన దివ్యతే । జంబువాఁడు

గీ. ద్విజుల నేలెడు వాఁడోష । ధీ విభుండు
జోగమకు శుద్ధిమతికి వి । శ్రుత సుగుణకు
పత్యనువ్రత కమర సం । ప్రార్థ్యమైన
సౌఖ్య సంపదఁ జంద్రుఁ డొ । సంగుఁగాక!

శా. గోవిందద్రుహిణాది సర్వ దివిష । త్కోటీర రత్నాంకుర
వ్యావల్గచ్చరణారవిందుఁడు విశా । లాక్షీ మనోభర్త కా
శీవిశ్వేశుఁడు మా మనఃపథమునం । జెన్నొందు జోగమ్మకుం
గైవల్యంబు నొసంగుఁగాక! శశి రే । ఖా పేశలస్వాంతుఁడై.

సీ. కమలా సరస్వతీ । గౌరు లే దేవత
శక్తి లేశమున సు । జాతలయిరి
తలఁ దాల్తు రే దేవ । త నిదేశ మెప్పుడు
దామోదర హర ప । ద్మజులు ముగురు
దాసానుదాసులై । తగనుందు రే దేవ
తకు హరిత్పతులు పా । దములమ్రోల
తటిఁ దప్ప కాడు నిం । ద్రావరుణాశల
సవితృయే దేవత । శాసనమున

గీ. సర్వ శక్తి సుసంపన్న । సర్వలోక
జనని యా పరదేవత । సాధురక్షి
జోగమకు విశ్రుత గుణకు । శుద్ధిమతికి
శాశ్వతానంద పదవి నొ । సంగుఁగాత!

---



శ్రీరస్తు

బ్రహ్మానందీయము

# జగదానందము

## ప్రథమాఙ్కము

(నాంది)

శా. శ్రీరాజిల్లు సితాతపత్రము గజ । గ్రీవుండు; వింజామరల్
వారర్కేందులు; భృత్యకృత్యములు గీ । ర్వాణాగ్రణుల్; పట్టమొ
ప్పారన్ శంభుఁడు నిర్వహింపఁ గడు శ్రే । యంబైన సింహాసనం
బారోహించు రమా విభుండు జగదా । హ్లాదంబుఁ గావించెడున్!

వెండియు

మ. కమలాపాణితలంబు నందొకఁడు గం । గా పూర కోటీరు నం
సమునందొక్కఁడుఁ జక్రమందొకఁడు వై । శాఖాద్రి నొక్కండు వే
డ్కమైయుంగ్రాలుమురారి హస్తములు ర । క్షాదక్షముల్ నాలుగున్
సుమనశ్శ్రీలకు నాకరంబులవి ప్రో । చున్ మీ పుమర్థంబులన్!

మఱియు

మ. సురవైరిద్విప కుంభకర్ణ విదరా । స్తోకవ్యథాధాన ని
ష్ఠురమై యుద్ధత మేఘనాద రభసా । టోపప్రికారాతి మ
త్సరమై ధూత సముల్లసద్దశముఖా । శామండలంబై విని
ర్భర రీతిన్ ధ్వనిసేయు శార్ఙ్గగుణము । త్పాదించు భద్రంబులన్!

(సూత్రధారుఁడు ప్రవేశించు)

సూత్ర—(కలయఁజూచి) వసంత మది విజృంభించినది.

మ. సురసాలంబులునా రసాలములు చ । త్తుఃప్రీతిఁ గావించె; నం
బర మాధూతహిమాంబరంబయి నవా । భం దేజరిల్లెం; బొరిం
బొరివీచెన్ మలయానిలంబులు; శుకం । బుల్ కింశుకంబుల్ రుచిం
బరగెం దద్దయుఁ; గోకిలాళులు నళుల్ । పాడున్ మనోభూకథల్.

మఱియు

సీ. చూతంబు లామూల । చూడంబు శోభిల్లెఁ
గొసరి కోయని కూసెఁ । గోకిలములు
జాతె దిక్కుల నవ । శ్యామోత్తరీయంబు
మలయానిలములు స । మ్మదముఁ జూపెఁ
బ్రసవధూళీ ధూస । రములయ్యె దివసంబు
లాయితపడిరి శ । య్యాలకుఁ జెలులు
మరుని వింటి గొనమ్ము । మాటిమాటికి మ్రోసె
ఘూర్ణిల్లి విరహుల । గుండెలవిసె

గీ. శోభనంబులమీఁద సు । శోభనంబు
లుత్సవంబులమీఁద మ । హోత్సవములు
సంపదలఁ దులదూఁగెడు । జంపతులకు
సర్వ మానంద రస విని । ష్యందమయము.

(తెరవంకఁ జూచి) దిద్దుకొనుచున్నది కాఁబోలు! నటి యిం
కను నేఁ డీవలకు రాకున్నయది.

నటి—(వచ్చి) నగలా? నాణెములా? దిద్దుకొనుటకు.

సూత్ర—రంగోపజీవులకు నగలును నాణెములు నెట్లు?

నటి—పోనిండు! నారలుగట్టి నవయుచున్నను నట్టింటనున్న నారీమ



ణులను బట్టపగలు గొనిపోవు ప్రబుద్ధులు. పుట్టిరి; గడప
దాఁటిన గౌరవము దక్కదుగద?

సూత్ర—జడియకుము!

మ. సురసందోహ శిరఃకిరీటమణి తే । జోరాశి మధ్యస్ఫుర
చ్చరణాంభోజుఁడు సాధుభక్త జనతా । సంరక్షకుం డిందిరా
వరుఁ డామ్నాయ శిఖావతంసుఁడు కృపా । వారాకరుం డెంతయున్
గరుడాంకుండు గలండు ధర్మువుదెసం । గంజాక్షి! సంరక్షియై.

కావున—

క. మింటికి నెగసిన నెవరికిఁ
గంటికిఁ గనఁబడక కడలిఁ । గాఁపుర మున్నం
గంటకుఁడై పరకాంతల
నంటఁదల్లఁచు కూళ మడియు । నప్పుడ యెందుఁ.

ఇది విశేషము—

గీ. సానఁ బట్టినకొలఁది వ । జ్రంబునకును
బుటము వెట్టినకొలఁదిఁ గ । ద్బురమునకును
వన్నె హెచ్చిన చందాన । వనితలకును
గష్టముల నోర్చినప్పుడే । కలుగు గుణము.

నటి—అవును! అయినను వచ్చినది విదేశము.

సూత్ర—అవుఁగాక!

క. న్యాయము గల వానికిఁ గడు
సాయంబును జేయు నడవి । జంతువులయినం
బాయక యెప్పుడు; మఱి య
న్యాయము గల వాని విడుచు । ననుజన్ముండున్.

నటి—అదేమో యెంతసెప్పినను నా మది గలంగుచునే యున్నది.

సూత్రి—(చిఱునగవుతో) చక్షుఃకాతర్యము నేఁడు నీ హృదయమున వేళ్ళువాఱినది.

నటి—పరిహాసము గాదు-

సీ. కాషాయ వసన సం। కలితులయ్యుఁ గులాంగ
నలఁ గికురించు స। న్న్యాసులకును
విమల వంశమున నా। విర్భూత లయ్యుఁ గ
య్యాలకై రేఁగు గ। య్యాళులకును
కుహనా వినోదులై। కొంకక సన్మార్గ
పరిపంథులగు సురా। పాయులకును
బిడియ మింతయు లేక। పెనఁగి రచ్చలయందుఁ
జిక్కట్లు పచరించు। జఱభులకును
గీ. పరుల సంపదకోర్వని। పాపులకును
వావి వరుసలు లేని క్ర। వ్యాదులకును
దావలంబైన కాలంబు। దఱిసె లోన
జళుకు సెందక యుండు నే। చదుర యింక?.

(తెరలో) అరే! రే! యెవరు క్రవ్యాదు లని మమ్ముఁ జేర్కొనుచున్న వారు?

నటి—(చూచి--భయకంపముతో) రాక్షసుఁడు—

సూత్ర—భయపడకు! సారణ వేషము వహించి వచ్చు మన శైలూషుఁ డతఁడు!

నటి—ఏనాటకము మన మిప్పుడు ప్రదర్శించునది?

సూత్ర—

సీ. జనియించె నే దివ్య। చరిత విశ్రుత మైన
క్షితి తలంబునయందు। సీత పగిది



భజియించె నే నిష్క। పట పతివ్రత సదా
భక్తిమైఁ బతి పాద। పంకజములు
మానక యేప్రొద్దు। మంగళాలంకార
ములతోడ నొప్పె నే। ముద్దరాలు
మాటాడుచునె యిందు। మతి శీతి నంతలో
నే యిందువదన తా। నేగె దివికి
గీ. అట్టి భువనైక పావని। కమల హృదయ
కాత్మ పత్నికి "జోగమ" । కక్షయంపుఁ
బుణ్య లోకము లగునట్లు। పొందుపఱిచి
కవి రచించిన యది నాట। కంబు చెలువ!.

నటి—తెలిసినది; బ్రహ్మానంద విరచితము జగదానందము.

సూత్ర—అనంతర కరణీయమునకు మనమును సన్నద్ధుల మవుదము; రమ్మె!

(నిష్క్రమింతురు.)

---

(సారణుఁడు ప్రవేశించును.)

సార—నిఖిల సురాసుర కోటి కోటీర సంఘటిత మణి నికర నీరాజిత పాదపీఠుండయిన మా దశకంఠ మహారాజు సమాగత నానా విషయ రాజన్య నివహంబును, శతానందాది స్వస్తివాచని కంబును, జనక రాజర్షి పరికల్పితంబును, శైవ చాపారోపణ పణంబును నై యొప్పు సీతాస్వయంవర మహోత్సవమునకు బురోహితునితోఁ జనుచు, దేవయజన సంభవమైన యక్కన్య ఋశ్యశృంగ చరూద్భవుండైన ప్రథమ దాశరథిపై దృఢ మనోరథమై యున్నదనియు గాధేయుఁ డందుఁ గార్య నిర్వహణ ధూర్వహుఁడై సవనావనార్థ మని సాకేతమునుండి కొని

తెచ్చిన దశరథ నందనులను రామ లక్ష్మణులను మిథిలకుం గొనివచ్చుచున్న వాఁడనియు నిగూఢ చారులవలన విని "మధ్యే మార్గమున నమ్మునిరాజనందనుల మడియింపు" మని తన నిదేశము తాటకతోఁ జెప్పుటకు నన్నుం బనిచె. (వీక్షించి) అదిగో!

సీ. పరుష దుర్భర జటా । పటల ధారలు దాఁకి
ఖండంబు లవుచు మే । ఘములు సెదర
జటుల మర్త్య కరోటి । చర్వణంబులయందు
ఘుర్ఘురధ్వనుల శం । కలు జనింపఁ
బతదస్థి మాంస లో । భముచేత ముఖ గహ్వ
రమునకుఁ జుట్టు గృ । ధ్రములు మూఁగ
సహజ ధాటీ వేగ । ఝాడిత్యమున కంబ
రాధ్వనీన పురంధ్రు । లపసరిల్ల
గీ. కఠిన దంష్ట్రాగ్ర దృషత్పవి । ఘట్టనముల
నగ్ని మిణుఁగురు లురల నా । ర్ద్రాంత్ర కవచి
తాపఘన భ్రమ దతికపి । లాక్షి తార
వచ్చుచున్నది తాటక । వాత్య నాఁగ.

(తాటక ప్రవేశించు)

సార—(సమీపించి-నమస్కరించు.)

తాట—సారణుఁడా! దీర్ఘాయుష్మంతుఁడవు గమ్ము!

సార—ఎక్కడ కిప్పు డీ ప్రయాణము?

తాట—విశ్వామిత్రుఁడను రాచబాపఁ డొకఁ డయోధ్యనుండి రామలక్ష్మణు లను రాచబుడుతల నిరువుర నిజాశ్రమమునకుం గొనివచ్చి వారిపాదధూళిచేఁ బ్రస్తర పుత్రికలకుఁ బ్రాణప్రతిష్ఠ సేయించుచు సవనమను మిష పన్ని విహతికరులను మన



సయోధ్యులం జంపించుచున్నవాఁడఁట! కావునఁ బోతరించిన యమ్ముని మృగ యూథములను మ్రింగివచ్చుట కనుజ్ఞ దయ సేయుమని మహారాజుతో మనవి సేసికొనుటకు.

సార—ఆనుకూల్య మిట్లుండవలయు! నీ కోర్కెయు మహారాజు మనోరథము నొకటియ!

తాట—అదెట్టులు?

సార—వినుచున్నావుగద వైదేహిని!

తాట—అవును! ఆ రాచకన్నియకు స్వయంవరమనియును—

సార—ఆ స్వయంవరంబునకుం జనుచు మన మహారాజు—

తాట—పుండ్రేక్షుదండముల భక్షించిన జిహ్వా తింత్రిణులకు నువ్విళులూరినట్టులు. తరువాత?

సార—నీ చెప్పిన రాము నయ్యబల వలచియున్నదనియు విశ్వామిత్రుఁ డా నరపోతముం దమ్మునితో మిథిలకుఁ గొనివచ్చుచున్నవాఁడనియు విని పురము సొరకమున్న వారి మడియింపుమని నీతోఁ జెప్పుమనియె.

తాట—బలే! నా భాగ్యము పండినది. వాయువేగమున నిప్పుడ చని కార్యము మించకుండఁ బురబహిఃప్రదేశమున మునిముచ్చుతో రాచబుడుతలఁ గఱక ఱలాడించెద! నీవు సని శల్యభక్షకులును రుధిరపాయులునైన మా కుఱ్ఱలను సుబాహు మారీచులను వేవేగఁ జెప్పి పంపుము!

సార—ఇదిగో! నీ వెనువెంట నంపెద. (నిష్క్రమింతురు.)

—పిదప స్వయంవర మండపమున జనకాదులు చూపట్టుదురు—

జన—భువనత్రయ పవిత్ర మిత్ర! విశ్వామిత్ర! అనవలోకిత జామాతృ సంపన్నిధానమై దుఃఖధూమితమైన నా హృదయమునకు భవదాగమనము హర్షామృత కరకా వర్ష మవుచున్నది.

విశ్వా—చెలీ! సీరధ్వజ! యాజ్ఞవల్క్యమునీంద్రునితో వేదాంతములం
జదివిన భానుప్రశిష్యునకు నీకు శోకహర్షములు లోకయాత్ర;
అయినను గాత్యాయనీ కమన కార్ముకారోపణ ప్రవీణుండగు
నల్లు నగపఱుచు భారము మాయందున్నయది.

శౌష్కలుఁడు—రాజా! రావణ పురోహితునకు నాకును బ్రత్యుత్తర
మీయవేమి?

చ. ఎవనికో చూచి యీఁదగిన దేకద కన్నియ కోరుచున్నవాఁ
డవగత బాహు సారుఁడు మహాచలశేఖర చాలకుండు శాం
భవ మన నెంత చాప మది బాహుపరీక్షకు? సర్వవేళలన్
భువన విగీతుఁడై పరగు భూసురు జందెముఁ జూడనేటికిన్.

శతానందుడు—ప్రత్యుత్తరమున కేమి యున్నది? సుక్షత్రియులు
దృఢప్రతిజ్ఞులు (జనకుం జూచి) రాజర్షీ! రాజనందను లరుదెం
చిరి: సహసఖి సీతయు వచ్చెడిని.

(చెలితో సీతప్రవేశించు.)

సీత—(జనకునకు నమస్కరించు.)

జన—అమ్మా! కల్యాణివి కమ్ము! ఈ వచ్చిన రాజచూడామణులను
నీ చెలి రత్నప్రభ నిరూపించి పలుకు; హర శరాసన మారో
పించు నమ్మహాబాహు వరించి సఫల మనోరథ వగుము!
(పుష్ప దామము నొసఁగు.)

సీత—(నునుసిగ్గున గ్రహించు.)

జన—(శతానందునితో) కర్తవ్యము నివేదింపుఁడు!

శతా—(రాజులం జూచి) ధానుష్కాగ్రసర ధరాభరణులార!

ఉ. ఆపె విదేహకన్య యజ నావని సంభవసీత; యిమ్మహా
చాపము శైల సన్నిభము శైవము నాగము నాగుణమ్ము నా
రోపము సేయువాని విని ప్రౌఢభుజుఙ్ వరియించు నంతరి
తూపగ భాతిఁ గీర్తి కకు బంతములఙ్ వెలయన్ సపత్నియై!

రత్నప్రభ—(ఇంచుక పరిక్రమించి—సీతతో)

శా. బాలా! బాల తుషారభాను శుభశో భాగర్వ రేఖా సుహృ
త్ఫాలా! పుష్పిత పారిజాతములునా భాసిల్లు నీ భూపులం
బోలంజూడుము? కొల్వరానివయి మో మున్నిండియున్నట్టి నీ
వాలుంగన్నులు గాంచుధైర్యమునకున్ వైదేహి? కార్యార్థమున్.

సీత—(రాజమండలము నవలోకించి—తనలో) భగవంతుఁడు చతు
ర్భుజుఁడు సాధుజన పరిత్రాణార్థము రఘువంశమున రామ
చంద్రాకృతి నవతరిల్లె నని మునులు వాగడఁ దండ్రిచాటున
నుండి విని హృదయ మట నిల్పియుంటి; ఇప్పు డీ హరశరాస
న మారోపించు నలఘు భుజు వరియింపుమని జనకునాజ్ఞ.
ఒరు లట్టి దోష్మంతు లుండరా? ఉందు రేని మొదల మది
దవిలిన పతిం బరిత్యజించి యింకొకని వలచుటకంటె నకార్య
మేమియుండు? అవుఁగాక! సత్యమే సర్వమునకు శరణము.

సీ. శ్రీమదచ్యుత పాద సేవా సుహేవాక
నయి నే విశుద్ధాత్మ నయితినేని
నా నమ్మిన విభుండు నారాయణుండయై
భువనావనార్థంబు పొడమెనేని
నామాత యిమ్మహార్ణవమేఖల మహీ పా
వనియైన విబుధైక వంద్యయేని
నాతండ్రి మిథిలాధినాథుండు తత్వజ్ఞుఁ
డైన సంయమ ధనుఁ డయ్యెనేని

గీ. భద్రగుణుఁడంచు శ్రీపరబ్రహ్మ మనుచు
ధర్మనిధి యంచు నాపాలి దైవ మనుచు

నా యుపాసించు రఘురాజ । నందనుండు
వంచినప్పుడ యీవిల్లు । వంగుఁగాత!

రత్న—సఖీ! జానకి!

క. పౌరస్త్యుఁ డతఁడు ప్రభుఁ డం
భోరాశి మహేంద్ర కుధర। ములకు, నుతివ్యా
హారము లవి యేటికి? దో
స్సారముఁ జూచెదవుగాక! । శశి చారు ముఖీ!.

పౌర—(తనలో) ప్రారంభముననే నన్నుఁ జేర్కొన్నది. (లేచి సీతం జూచి).

క. మేరు మణిప్రకరము పా
టీరాచల మారుతము త । టిత్కాంతి సుధా
సారముఁ గొని శతధృతి యీ
తీరున వెలయించె రచన । తేటపడంగన్.

(విల్లు స్పృశించి)—వింటికి దండము! విధుముఖికి నమస్కారము! (చని—కూర్చుండు.)

సీత—అయినది వీని పని! పౌరస్త్యుల పస పాగాలయందే.

రత్న—చెలీ? సీరధ్వజ రాజ నందిని!

గీ. చంపకారామముంబోని । సౌరభంబు
గుప్పుగుప్పున నెంతయుం । గుబులుకొనఁగఁ
బ్రసవ సాయకుఁ బోలు న । ప్పార్థివుండు
దాక్షిణాత్యుఁడు చూడు వే । దండ గమన!.

దాక్షి—(లేచి—చూచి)

సీ. సరసీరుహముఁ జేసి । చందమామం జేసి
చేసె విధాత యీ । చెలువ మోము!



దొండపండుం జేసి । తొగరుటాకుం జేసి
చేసె విరించి యీ । చెలువ మోవి!
నీలంబులం జేసి । నీరదంబులఁ జేసి
చేసె విశ్వసృజుఁడీ । చెలువ కురులు!
హర్యక్షముం జేసి । యంబరముం జేసి
చేసె వాగ్దయితుఁడీ । చెలువ కౌను!

గీ. మీనములఁ జేసి కొదమ తు । మ్మెదలఁ జేసి
చేసె నీలేమ కన్దోయి । సృష్టికర్త
మఱియు నుపమానముల నెల్ల । మచ్చుఁ జేసి
చేసె ద్రుహిణుఁడీ సౌందర్య । సేవధి నొగి.

(విల్లుచూచి) కొండను ద్రింగిన కుండలీంద్రము. (కూర్చుండు.)

సీత—దాక్షిణాత్యుల చదువులు వేఱు.

రత్న—చెలీ! మైథిలి!

క. పాశ్చాత్యుఁ డతఁడు సిరుల న
పశ్చిముఁడు ధరారమణుఁడు । భామా జన చే
తశ్చోరితసఖుఁడు మఱియు వి
పశ్చిద్వినుతుండు చూడు । పర్వేందు ముఖీ!.

పాశ్చా—(లేచి)

సీ. ప్రాలేయ కిరణ బిం । బమునకుఁ బ్రతిబింబ
మనుచందము వహించు । నాననంబు!
సారసంబులకు పి । ప్పలు నాఁగ నయనంబు
లాకర్ణ దీర్ఘంబు । లై చెలంగుఁ
గచ కలాపము గ్రాలు । ఘన మయూర కలాప
పరిధి సౌభాగ్య మే । పాటి యనుచుఁ

కుసుమాయుధుని చేతి । కోదండమునకు వా
ర్త్రిక మిది నాఁగ భ్రూ । రేఖ పొసఁగు
గీ. విద్రుమమునకు నోష్ఠంబు । వినిమయంబు
సైకతమునకు సహపాఠి । జఘన బింబ
మూరువులు రాజ రంభల । కొజ్జలు మఱి
మెఱుఁగులకు మేని చాయ లా । మ్రేడితములు.

(విల్లుసూచి) వజ్రమేనియు వంగునుగాని యిది వంగదు. (చని కూర్చుండు.)

సీత—పాశ్చాత్త్యుల పౌరుషము పరిచారికలయందు.

రత్న—సఖీ! సర్వంసహా కుమారి!

క. కరదీకృత దిగ్రక్షకుఁ
డరి దమనుఁడు కందుకీకృ । తాహార్యుఁడు ని
ర్భర వీర్యుఁ డతఁడు లంకా
పరివృఢుఁడగు రావణుండు । ప్రమదా మణిరో!

రావ—(లేచి)

శా. బంధూకేందుకళా తమస్తబక రం । భాస్తంభ విద్యుల్లతా
గంధావర్త తరంగ తూణ ముకురా । కాశాది దివ్యోపమా
సంధాతీత వినూత్న రత్న సుషమా । సంసృష్టి సంకల్పభూ
స్కంధావార పతాక యీ తరుణి తా । సౌందర్య సారంబునన్.

మఱియు

సీ. మోముఁజూచి యథార్థ । ము వచింపు మన్న నీ
యమ యిందు సోదరి । యనఁగ వలయు
నయనంబు లరసి య । న్న నిజంబు కమలావ
తార యీపె యటంచుఁ । దలఁపవలయు



వళుల నూహించి యి । వ్వనరుహాక్షిం గన్నఁ
జూపట్టు నూర్మ్మల । చుట్టఱికము
సౌభాగ్యమున నీమె । సరిపోల్చి పల్కిన
మాధవి యను బుద్ధి । మఱి జనించు
గీ. గగనపాతాళ మర్త్య లో । కములయందుఁ
గల కళావతు లెల్లరు । గర్వ రేఖ
విడిచి యీబిడ పాదార । విందములకు
మ్రొక్కి తీరంగ వలయుఁ గే । ల్మొగిచికొనుచు.

(వింటివంక వీక్షించి)

క. కైలాసముఁ గదలించిన
నా లావు పరీక్షకెంత । నలుఁగుఁడువడి యే
మోలనో చివికిన విల్లిది?
కేలం గీలింతు జాన । కీ మూలమునన్.

(విల్లు లేవ నెత్తు.)

జన—(చేయడ్డు వెట్టుకొని) మహాత్మా! గాధినందన! తుదకీ రావణుని పాలు గాదుగద నా యనుఁగు బిడ్డ?

విశ్వా—జడియకు! చాపారోపణము రావణునకు సాధ్యముగాదు; అది వంపఁగల వీర రాజ నందనుఁ డింకొకఁడు.

రావ—(అకాండ వినయ మభినయించి కూర్చుండు.)

సీత—ఇంతే వీని చేవ? నిస్సారములయినవి యెందు కిన్ని చేతులు?

శౌష్క—ఓయీ! శతానంద! లాఁతు లందఱు శక్తిచాలక చతికిలఁబడిరి; మాహేశ్వరుఁడుగావున మా మహారాజు శైవమని సంశయించె. పూర్వ గీర్వాణ విభుని భుజబలము భువన విదితము. వంకత్రోవనుండి మీ యాజ్ఞని ఋజుమార్గమునకుఁ ద్రిప్పు!

శతా—ఎందుకీ చప్పిడిమాటలు? ఇంటిమీఁద లేని శివభక్తి వింటిమీఁదనా మీ తేనికి?

శౌష్క—(దనలో అహల్యానందనుఁడవౌదు! గౌతముని విడిచి యిందు)ని సంశ్రయించినట్లున్నది నీ తెలివి.

రత్న—అమ్మా? దేవయజనసంభవ! చైత్రవైశాఖములుపోలె వెల్లయు నయ్యలా రమణ కుమారుల నవలోకింపుము!

క. సుసమీచీనులు గుణ వి
శ్వసనీయులు శక్ర విజయ । సహకృత్వులునై
యొసఁగుదు రుత్తర కోసల
వసుధాధిపు లహిమ కిరణ । వంశ్యులు జగతిన్.

ఆ రాజచూడామణు లున్నతోన్నతులు—అందు

సీ. దశరథక్ష్మాపాల । తనయులై యిలమీఁద
వెలయువారు భృశమ్ముఁ । దెలియువారు
చట్టులై గాధేయు । సన్నిధి విలువిద్య
నేచువారు మఖమ్ముఁ । గాచువారు
గజ సహస్ర బలంబు । గలది తాటక దానిఁ
బొడుచువారు సునీతి । నడుచువారు
గ్రావమై పడియున్న । గరితకు శాపమ్ము
విప్పువారు శుభంబు । లొప్పువారు

గీ. కలభ గతిబారు సింహావి । క్రమమువారు
చల్లనగువారు దీనుల । సాకువారు
వరలువారు సాకేతము । వారు ద్వంద్వ
చారులగువారు రామల । క్ష్మణులు వారు.

మఱియు ద్వంద్వచారులు భరతశత్రుఘ్నులు వీరి యనుజులు.



గావ—(తనలో) త్రవ్వెలెడున్నారో లేరో వీరా "తాటకా! సుబాహులం జంపిన ధనుర్ధరులని" మారీచుఁడు నా చెవిలోఁ జెప్పిన రాచబుడుతలు?

జన—గిరిశేపులవంటి మూఁపులును సింగపుంగొదమలవంటి ముంజేతులునుంగల యిబ్బాలుర కసాధ్య కార్యము లుండవు.

శౌష్క—(తనలో) మీ యిచ్చవచ్చినట్టు లనుకొనుఁడు.

రత్న—సఖీ! దళితేంద్ర నీల దళ శ్యామల మయిన యమ్మహః పుంజము.

క. జగదానంద ధురంధరుఁ
డగు రాముఁడు! సతతమమ్మ । హాభాగు మదిన్
నిగమ కిరీట విహారులు
భగవంతుం డని భజింతు । పరభక్తిమెయిన్.

సీత—(సానురాగముగఁ గ్రేఁగంటం జూచు.)

రాము—(తనలో) నా పై రెత్తుచున్నది.

లక్ష్మ—(తనలో) ఈమెయందు నాకు మాతృబుద్ధి వొడముచున్నది.

విశ్వా—వత్సా! రామభద్ర! చూచెదవేమి? లేచి శరాసన మారోపింపుము!

రాము—(పీఠము డిగ్గి) వత్సా! లక్ష్మణ! గురువు లట్లు సెలవిచ్చుచున్నారు.

లక్ష్మ—(చిఱునగవుతో) ఆర్యా వికీర్యమాణ స్మేరాపాంగ పూరవలనములును—

రాము—(తనలో)

క. అమితానవద్య గుణ స
ద్మములై ఛద్మానభిజ్ఞ మాధుర్య విశే

షములై వెలయును; శుభ చి
హ్నములీ వికసిత పయోరుహాననయందున్.

(ఔత్సుక్యముతో)

గీ. చాప మైక్షవ మగుఁగాక! । చాప గుణము
చంచరీకౌఘ మవుఁగాక! । సాయకంబు
లవియు విషమంబు లవుఁగాక! । హరు వశైన
మైథిలీ మూలమున నిల । మరుఁడె విజయి.

(విస్మయముతో వింటికిఁ బ్రదక్షిణము సేసి)

మ. హరుఁడాకర్ణము మౌర్విలాగి మును ని । న్నాకృష్టముం జేయుడుఁ
గరమున్ రాలెఁ బురావరోధ పలభు । క్కాంతాశ్రపఃపూరముల్
సరిదీశాన నిషంగ చాపమ! నమ । స్కారంబు సీతా స్వయం
వరశుల్కంబవు గాన సోఁకవలసెన్ । వైరస్యమున్ సైఁపుమీ.

(విల్లు గొని గుణమెక్కించు)

శతా—(ఆనందముతో)

క. రెండయ్యెను ధూర్జటి కో
దండము నడిమికిని విఱిగి । దాశరథి భుజా
దండ సమాకృష్టంబై
కొండలవలె సన్యనృపుల । గుండియ లవియున్.

సీత—(రాముని స్కంధమునఁ బుష్పదామ మునిచి సిగ్గునఁ జను.)

విశ్వా—చెలీ! సీరధ్వజ! భగవానుండయిన భృశాశ్వమహామునిని వేయేండ్లు గొలిచి మేము వడసిన ధనుర్వేద మిప్పుడు చరితార్థమైనది.

జన—ఆర్యా! శతానంద! సీతా పాణిగ్రహణమునకు రామభద్రు నభ్యర్థింపుఁడు!



శతా—భగ్నమైన భవ శరాసనమే కల్పినది సీతారాములపాణులు; ఊర్మిళా లక్ష్మణుల పాణిగ్రహణము మనము ప్రార్థింప వలసినది.

జన—మహాత్మా! గాధినందన! సీతోర్మిళలకు రామలక్ష్మణులను వలెఁ గుశధ్వజ దుహితలకు మాండవీ శ్రుతకీర్తులకు భరత శత్రుఘ్నుల నభ్యర్థించుచున్నాను.

విశ్వా—సిద్ధసంకల్పునకు నీకు సర్వము సంఘటితము! దశరథుం బిలువనంపుము.

శౌష్క—ఓయీ! నిమిరాజా! మించలేదిప్పుడేని యించుక నిదానించుకొనుము.

జన—(శతానందుని చెవిలో నేదో నొడువు.)

శతా—రాజరాజావతంసులు తమరందఱు మా చేయు శోభనసత్కారములను గ్రహించి మమ్ము సమ్మోదభరితులం జేయుండని మా రాజుగారి విన్నపము. రండు! దయచేయుఁడు

(రావణవర్జ మందఱును నిష్క్రమింతురు.)

రావ—(ఆకాశమున లక్ష్యముంచి) ఓరీ! రామా!

క. ఐరావణమునకును మద
మైరేయము నుడిపి దివిజ । మార్గణ ధారా
సారముఁ గ్రోలినయవి రణ
దారుణములు భుజము లివి ప్ర । తాపోష్మలముల్.

వృద్ధుగావున మతిమాలి మైథిలుఁ డకార్య కరణమునకుం జొచ్చినఁ జొచ్చుఁగాక! నీవేని యించుక యోజించుకొనుము! భువనైకవీరుఁ డసురసార్వభౌముఁడు వింశతిభుజుఁడు వీఁడు గన్నువేసిన కన్నియం బెండ్లియాడి మర్త్యుఁడవేమి సేయఁగలవు? ఇది నా ప్రతిజ్ఞ

(స్రగ్ధర)

దిక్కుంభుల్ తల్లడిల్లన్ । దెస లులికి పడన్ । దేవతల్ డిల్లపోవం
జుక్కల్ రాలన్ గ్రహంబుల్ । సుడివడితిరుగన్ । సూర్యచంద్రుల్ వడంకన్
నిక్కుల్ నీనీటుగోటుల్ । నిగనిగమెఱుఁగుల్ । నిగ్గులున్ గ్రమ్మగిపోవం
జిక్కుల్ గల్పించి నీకుం । జివరకునెటులో । సీతఁ జేకొందుమాయన్..

శౌష్క—(తనలో) ఇదేమి చివర నమంగళము? అగుఁగాక? మా మహారాజున కిట్టి యమంగళములతోఁ బనిలేదు.

రావ—(శౌష్కలు నవలోకించి) రమ్మ! మనలంకకు మనము వోవుదము!

(నిష్క్రమింతురు.)

ఇది

శ్రీ బ్రహ్మానంద విరచితము జగదానందము

ప్రథమాంకము.





శ్రీరస్తు

బ్రహ్మానందీయము

# జగదానందము



## ద్వితీయాఙ్కము



(శూర్పణఖ ప్రవేశించు.)

శూర్ప—అహహా! గాధేయుఁ డెట్టి కపట నాటక మాడినాఁడు! తాటకా సుబాహులం బొడిపించి శివచాపారోపణ కైతవమున మహారాజ రావణ మనోరథము భగ్నము సేసినాఁడు; అవుఁగాక! యిఁక నా శక్తియుక్తులు సూచెద! తదర్థమ సంప్రదాయ విరుద్ధమై జుగుప్సావహమైనను రాజకార్యానురోధమున మానుషీ వేషము వహించి యిచ్చటికి వచ్చితి. (కలయఁజూచి) ఔపనిషదవ్యాహారాయతన మయిన యీ మిథిలానగర మిప్పు డనర్ఘ శృంగార భూయిష్ఠమై యొప్పుచున్నయది.

సీ. వాసితాశా చక్రి । వాళంబులై మించు
నగరుధూపములు హ । ర్మ్యములయందు
గగనాపగా తరం । గములతో సయ్యాట
లాడు మీఁదం బతా । కాంశుకములు

ఖగ నికృత్త సుధాంశు । కళలు నా ఠవణిల్లు
రతనాల ముగ్గులు । రథ్యలందు
సంధ్యార్క కిరణ కిం । జల్క శంకం జేయు
గుమ్మాల మాణిక్య । కుంకుమంబు
గీ. లుపనిషద్భాష్య పాఠంబు । లుడిగి మదన
దేవ గీతార్థ గాథ లా । దృతిఁ బఠించు
భవన శుకములు మర్మగుం । భములు విప్పి
భర్మ నిర్మిత వైడూర్య । పంజరముల.

చూడఁజూడ నాకుంబువ్వులుతు పోఁడుములు వాఁడముచున్నవి. (ముందుఁజూచి) అచ్చయోగి యితఁడెవరో వచ్చెడిని.

(యోగి ప్రవేశించు.)

యోగి—(కలయఁజూచి—తనలో) పెండ్లిసింగారమే యిట్టులున్నప్పుడు పెండ్లికూతు రెట్టు లుండెడినో!

శూర్ప—ఆర్యా! మహానుభావులు తమ రెవరు?

యోగి—(తనలో) ఆమలకములయట్టి యీ రుద్రాక్షములను, ఆచరణచూడము నలఁదుకొన్న యీ భస్మ పరివేషమును, వటావరోహ పటలముంబోని యీ జటా కూటమును జూచి ప్రత్యక్ష కపర్ది యని నన్నుఁ దలంపనివారు లేరు. (ప్రకాశము) జటాధర శిరోమణులము మేము. నీవెవ్వతెవు?

శూర్ప—అహల్యా తారల నధఃకరించిన జగదేక పతివ్రతా శిఖామణిని.

యోగి—పాతాళమున బలిచక్రవర్తిని మా చరణ తీర్థములచేఁ బవిత్రితుం జేసి సత్యలోక సత్కృతులమై చనుదెంచిన శిరోమణులకు మాకు మ్రొక్కవేమి?



శూర్ప—పూర్వపూర్వమునకంటె నుత్తరోత్తరము గరీయము. శిరస్సుమీఁదిది శిఖ గావున నీవే నాకు నమస్కరింపవలయును.

యోగి—(ఆనఖశిఖముఁ జూచు.)

శూర్ప—(ఆచరణచూడము నవలోకించి—చిఱునగవుతో) తెలిసితి! విరాధుఁడవు.

విరా—ఓహో! శూర్పణఖ.

శూర్ప—అచ్చట నీ చన్నపని యేమైనది?

విరా—సఫలమైనది. నీవేల వచ్చితిందులకు?

శూర్ప—మంత్రియు మాతామహుఁడు నయిన మాల్యవంతుఁడు "పిల్లా" యని నన్నుం బిలిచి "మన తేనికి జానకియందలి వలపగ్గలమై యున్నది. నీయట్టి చెలియలు నాయట్టి మంత్రియుం గల మహారాజు విఫలమనోరథుఁడగుట మనకుఁ త్రపాకరము శివధనుస్త్రోటనము తప్పుమోపి దాశరథిం బొలియింపు మని విరాధునిచే భార్గవునకుఁ గబు రంపితి; క్షత్రయూథమునయందు సహజద్వేషము గల యతఁడట్లు గావించు; ఒకప్పుడతఁడును దానప్పనికిం జాలండయేని కుహానకుం జాలిన కుంచె ఇంకొకటిలేదు; అసాధ్య కార్యముల సాధించుతఱిఁ దొడిగికొనదగినకత్తెర యిదియ కుహనాదేవతాక" మని యేమేమో కతిః యంప నే నిందులకు వచ్చితి. అచ్చటఁ బరశురాముఁ డేమనియె?

విరా—(తెరవంకఁజూపుచు) అదిగోఁ బ్రళయ సమయ త్రినయనుని భంగి!

శూర్ప—ఇఁక నీవు చని "దశరథుఁ డయోధ్యనుండి వచ్చెననియు రామలక్ష్మణ భరతశత్రుఘ్నులకు సీతోర్మిళా మాండవీ శ్రుతకీర్తుల వివాహములు నిష్ప్రత్యూహముగ నయినవనియు

మాతామహునితో నా మాటలుగా మనవి సేయుము! తిరస్కరిణీప్రభావమున నదృశ్యనై మొదలఁ బరశురామ నాటకముఁ జూచి పిదప సమయోచితముగ నింద్రజాల మాడి యేనుం జనుదెంచెదను.

(నిష్క్రమింతురు.)

(తెరలో)

మ. శరచాపంబులు కేలఁబూని విలయ । స్ఫారోష్ణభానుస్ఫురత్
కిరణాపాటల దృక్ప్రసారములచేఁ । గిర్మీరితక్ష్మాతలాం
బరదిగ్భాగుఁడ శేష లోక పటలో । త్పాతంబు సూచించుచున్
హరశిష్యుం డరుదెంచె భార్గవుఁ డవా । ర్యక్రోధ సంరంభుఁడై.

(క్రుద్ధోద్ధతుఁడు పరశురాముఁడు ప్రవేశించు.)

పర.—ఏమీ విడ్డూరము!

చ. మఱచిర రాజు లౌర! మద । మత్తులు మమ్మును మా కుఠారమున్
విఱిచిర విఱ్ఱవీగుచును । వీరులమంచుఁ బురారి చాతముం
గఱకఱఁగోసి కంఠములు । కండలు సిమ్మచు క్షత్ర యూథముం
గొఱవడకుండ భూతముల । కుం బలివెట్టిన రైణుకేయుఁడన్

(అరసి) ఏరీ? ఆ సమర శౌండు లిప్పుడు లేనేలేరు.

ఉ. కత్తియుఁ గత్తియుం గవియ । కందువ పోరది మాసె; నాకమున్
గుత్తకుఁ గొన్న క్రొవ్వలవి । కుంటువడెన్ మఱి పేరు లేక; తా
నుత్తది గొడ్డుదయ్యె మహి । యొక్కరుఁడున్ మొనగాఁడు లేఁడుచి
య్యెత్తిన యేనుఁగేది విజ । యేందిరకుం గడు వేడ్క సేయఁగన్?

ఏమీ జనకుని చేవ?

గీ. పశు పురోడాశముం దిని । బ్రదుకుచున్న
బక్క యని లెక్కగొనక భూ । పతుల నడుమ



మున్ను విడిచితి నిప్పుడీ । ముదుసలికిని
వింటిచదువులు క్రొత్తవి । వెలసె నవుర!

అందును

సీ. పుర పలాద వధూ క । పోల కస్తూరికా
మకరికా రేఖా స । మాపకంబు
నగరాజ తనయావ । నత తత భ్రూలతా
శృంగార రుచిర ల । క్ష్మీ సఖంబు
సింధురాసుర శిర । శ్శిఖర దుస్సహ రుజా
పరిణాహ నిర్మాణ । పాకలంబు
దక్షాధ్వర మృగ వి । ధ్వంస హింసా కర్మ
కరణ దారుణ వృత్తి । ఘాతుకంబు

గీ. సర్వ గీర్వాణ బల సార । సంహితంబు
భూరి తేజంబు సాయకీ । భూత పరమ
పూరుషంబు జగత్త్రయ । పూజితంబు
నయిన హర పినాకముతోడ । నా ప్రతిజ్ఞ?

ఓ విదేహులారా! యేఁడీ యెందున్నాఁడు శివధనువు విఱిచిన యాదాశరథి?

చ. నఱికిన కార్తవీర్య భుజ । నాళములన్ స్రవియించి చయ్యనన్
వెడలు వాఱు శోణితము । వారక త్రావి వధించి దాయలం
జిఱచిఱ మాన్చినట్టి శివ । శిష్యుని చేతి పరశ్వధమ్ము చి
చ్చఱపిడుగై విరోధి విఘ । సంబున కాస వహించె వెండియున్

(రామలక్ష్మణులు ప్రవేశింతురు)

రాము.—వత్సా! లక్ష్మణ! భువన వీరుఁడని వినుచున్న భృగుపుంగవు నిప్పుడు వీక్షింతుము.

లక్ష్మ.—క్షత్త్రిద్వేషణుఁ డితఁ డొక పెట్టు పెట్టఁదగినవాఁడు.

రాము—అసదృశ తేజోరాశి యమ్మహాత్ముఁడు.

చ. హరునకు ముఖ్యశిష్యుఁడు ష । డాస్యునికిం బయిచేయి క్రౌంచభూ
ధరమును జించినట్టి విలు । దాల్పు ధరావలయంబు సర్వము
ద్ధ్వరమున ధారవోసిన వ । దాన్యుఁడు గొడ్డటఁ జిమ్మి యబ్ధి ను
న్న ఋషిపురస్సరుండు భృగు । నాథుఁ డఖండుఁడు వంద్యుఁ డెంతయున్.

పర—సందిగ్ధవిషయముల నౌచిత్యముంబట్టి నడువవలయును. సన్యస్తసంప్రహారక్రియా సమభిహారుఁ డయ్యును గురుధనుర్భంగవ్యలీకమువలన శివశిష్యుఁ డిప్పు డది వెండియు నుపక్రమించును.

సుర సహాయుధ్వ రావణుఁడు । సొంపుమెయిన్ నతుఁడై నదాని న
ప్పురహర చాపమున్ విఱిచెఁ । బూపకులుం; డది కారణంబుగాఁ
బురిగొని భార్గవుండిపుడు । భూభుజులం బొరివుచ్చి తద్దయున్
ధరఁ జతురర్ణవీ పరివృ । తం దడిపీనుఁగు పెంట సేసెడిన్.

రాము—(చూచి)

క. ఉరమున మృగాజినంబుం
గరమున సునిశితములైన । కాండంబులునుం
బొరయు నిదం వ్రతినాథుఁడు
పరిపూత హుతాశనునకుఁ । బ్రతిమై వెలయున్.

లక్ష్మ—కట్టుపుట్టమునుండి తెంపితీసిన కుశ తంతువులతో దొన లేటికో కుట్టుచున్నాఁడు?

పర—ఏఁడీ యెందున్నాఁడు దాశరథి?

రాము—(సన్నిధికింజని) భార్గవభగవానునకు సహానుజుఁడు సావిత్రుఁడు రాముఁడు మ్రొక్కుచున్నాఁడు.

పర—భగవానునికి నవమానము, భక్తునకుఁ బ్రణామము నిదెక్కడి యాచారము? సమర విజయివి కమ్ము!

రాము—అమోఘము తమ యాశీర్వచనము.



పర—అది నాలుకమీఁది మాట.

లక్ష్మ—నాభిలోని మాట?

పర—ఓరీ! మనుకులప్రసూతీ!

ఉ. వారక పట్టుపట్టి బల । వంతుల నిర్వదియొక్కమాఱు వే
ర్వేరుగ నేఱి యేఱి నృప । వీరుల నెల్లఁ బరశ్వధంబుతోఁ
జీరి హుతంబు సేసి తద । సృఙ్మధు ధారలఁ బిల్చిపిల్చి చ
ల్లారుచునున్న నాదు ప్రతి । ఘాగ్నికి నింధన మైతి విత్తఱిన్.

రాము—ఆర్యా! నా చేసిన దోసమేమి?

లక్ష్మ—చుఱచుఱలాడువానికి సుముఖముగాఁ జూపట్టుట.

పర—ఓరీ! అనాత్మజ్ఞ! త్రైయక్షము శరాసనము విఱువలేదా నీవు

లక్ష్మ—భస్మధూసరులకు భూసురులకు మీ కావింటి సుద్దు లెందుకు

పర—ఓరీ! సౌమిత్రి! భూతిభూషితుఁడు విప్రుఁడు వీఁడు విల్లుగొన వీరుండు గాఁడనుకొనుచున్నావు. విను!

మ. చరణప్రహ్వుఁడనై పురారికి నమ । స్యం జేసి సద్భక్తితో
సురకాండీరులు మ్రాన్పడం గఱచితిన్ । స్ఫూర్జద్ధనుర్వేదమున్
శరజాలమ్మును గుప్పినోంచితిఁ గడున్ । శాఖున్ విపూర్వున్ భయా
తురమైవచ్చి భవానిచాలుననితాఁ । ద్రోయన్ ననున్ వెన్కకుఁ.

లక్ష్మ—అహహా! పురహరునిపొంత విద్యాభ్యాసము; శరపరంపర గుప్పినది లక్ష్యము; విశాఖుని మించినది విక్రమము; బెదరి వెనుకకుఁ ద్రోసినది భవాని.

పర—హరశిష్యుఁ డబలలకంటెను బలవిహీనుఁ డనియా నీ కేరడము!

మ. విమతాసాసహిదోర్విజృంభణుఁడు ప్ర । హ్వీభూతషట్కంధరుం
డు మృడోపజ్ఞ శరుండు కృత్తనృప కం । డూలద్విపేంద్రుండు ర
క్త మధూన్మత్తపరశ్వథుండు భృగుమా । ర్తాండుండు వీఁడెవ్వఁడో!
సమరప్రౌఢులు మీరు పుట్టితిరి సా । క్షాన్నూత్నతార్క్ష్యధ్వజుల్!

రాము—(లక్ష్మణునితో) వత్సా! నీ వూరకుండుము.

పర—నీ వేమనియెదవు?

రాము—అందు నా తప్పించుకయు లేదు.

పర—భద్రమా పినాకమునకు?

రాము—అదియునుం గాదు. హర కరాకర్షణమువలనఁ బ్రిదిలిన యప్పినాకము నా చేయి సోకకమున్న తా విఱిఁగినది.

పర—అరె! చెనఁటీ! పుండు వొడిచినట్లు మాట్లాడుచున్నావు. ఏ నూరకున్నను బరశు వూరకుండదు.

రాము—తమ చిత్తము! ఏమయినను జన్నిగట్టులపై నైక్ష్వాకులు కత్తిఁగొనరు.

పర—ఎట్టెట్టూ? రాజరక్తప్రవాహముల భూమిని నీరేణుకం జేసిన జామదగ్న్యుఁడు వీఁడుత్తకొఱగాని జన్నిగట్టే?

లక్ష్మ—రాజులం జంపి కాకున్నను, అమ్మంజంపి భూమి నీరేణుకం జేసితివి.

పర—ఓరీ! రామ!

గీ. విఱిచితివి నీవు శిఖరిజా ౹ విభుని విల్లు
ధాత వైధవ్యమును వ్రాసె ౹ ధరణిసుతకు
రేణుకాదేవి తల నుత్త ౹ రించునపుడు
జాలి యెఱుఁగని గొడ్డలి ౹ చల్లనగునె?

(తెరలో) భార్గవ! భార్గవ!

మ. విలయక్రోధము సంహరింపుము! శిరో ౹ విన్యస్త హస్త ద్వయీ
కులమై నీకు జొహారొనర్తుము! ఫణి ౹ క్రూరంబులౌ సాయకం
బులు భావత్కములేడ? తేజియుత రా ౹ ముండేడఁ? గాత్యాయనీ
కలితోత్తంస మధూ భవన్నవ కృపా ౹ కల్పుండవై కావవే?

పర—కర్కశస్వరుఁడు వీఁడెవఁడు?



రాము—తాత రఘుపతి.

పర—ఇసీ! వెండియు నెల్లెడ రాచమొలకలు. (తెరవంకంజూచి) ఓదశరథ! నామ మాత్ర మిత్రుండయిన సూనుం గనుటచే నీవు మాన్యుండవు—అయినను వీరవ్యవహార మెఱుఁగవు.

లక్ష్మ—ఆః! జామదగ్న్య! తాతలదాఁక దేఁకుచున్నావు.

క. తాల్చెదఁ గేలం గైదువు
వ్రేల్చెద నీయట్టి దుష్ట ౹ విప్రులనంచున్
గెల్చెదవో! పాఱకమఱి
నిల్చెదవో! చూతు నిపుడు ౹ నీ ద్రఢిమంబున్.

పర—(మందస్మితముతో) ఓయీ! లక్ష్మణ! కనిష్ఠుఁడ వయినను నీవే కించిత్ప్రశంసాపాత్రుఁడవు. మాటలనయిన డీకొని మాకుఁ గర్ణపర్వము సేయుచున్నావు.

లక్ష్మ—కర్ణపర్వమో! స్వర్గారోహణ పర్వమో! ఫల నిష్పత్తికిఁ బూర్వ మది దుర్విజ్ఞేయము.

రాము—నిరపరాధ మధుర వయస్కుఁడవుటంజేసి యితఁ డేదో యనుఁగాక! క్షమింపుఁడు!

పర—ఇంతమాత్రము నోర్వ ననుకొంటివా? ఇందు మీ తప్పులేదు.

ఉ. ఇర్వదియొక్కమాఱు వసు ౹ ధేంద్రుల నేఱి వధించియున్ భవ
త్పూర్వులఁ జంప నోడితిఁ బ్ర ౹ బుద్ధుల నగ్న సుదృక్కులంబులో
గర్వము దక్కి డాఁగిరని; ౹ క్రమ్మఱ నయ్యది యిప్డు ధృష్టతా
ధూర్వహ మయ్యెఁ దద్దయు వ ౹ ధూ కవచాన్వయ ముత్తరించెదన్.

(తెరలో) జామదగ్న్య! సన్న్యస్తశస్త్రులను మమ్ము మరల శరాసనముఁ బట్టింతువా?

పర—ఓయీ! వైదేహ! శరాసన మెందుకు నీకుఁ బద్మాసనము.

గీ. శుద్ధ రుద్రాక్ష వలయ ని । చోళితులకు
దుర మదేట్టులు సోమ పీ । థులకు మీకు ?
భండనంబున మఱి ధను । ష్ప్రాణు లవుచు
వైరులం జెండు నాయుధ । వ్రతులు వేఱు.

(తెరలో) భార్గవ! భార్గవా? పెద్దలు చ్యవనాదులు సెప్పినట్లు విని కయ్యము చాలించి పరబ్రహ్మ పరుఁడవై యున్న నీకు వెండియు నిదియేమి?

పర—అయ్యో! యాజ్య కులస్నేహము శతానందునిఁ గలఁచు చున్నది. (తెరవంకఁ జూచి) ఓయీ శతానంద! క్రొవ్విన సావిత్రుల నుఱుమాడి పిదపఁ బశు పురోడాశ రసికు మీతేని నాలోచింతము.

(తెరలో) అరే! బ్రూణ హత్యా పాతకీ! ఐక్ష్వాకుల ప్రహారణ మవనిసురులయందు నిసర్గ నిష్ప్రాణ మని దానికిఁ గాకున్నను మా బ్రహ్మవర్చసమున కేని భయపడు!

పర—(నవ్వి) అరే! బ్రహ్మబంధూ! యేమంటివి? బ్రహ్మవర్చసమా? యెక్కడిది నీకు బాంధకినేయునికి? గౌతమునిదా? గోత్ర భిదునిదా? అహాహ!

మ. మను వంశంబునవారు శస్త్ర కథలన్ । మాటాడు వారేని బ్ర
హ్మనికాయంబనవద్య మాకృతిగణం । బౌనేని యద్దానియం
దును నీకుం గలదేని యిష్టి విఫలో । ద్యోగంబులో వీనితోఁ
బని యేమున్న దిసీ కుఠారమును ద । ర్భల్ మాకు నింకేటికిన్.

(దర్పముతో) అరే! ఐక్ష్వాక! ఈ యంబకము లిభవక్త్రునితోఁ బ్రమథులం బరుగెత్తించినవి; ఈ విపాఠములు క్రౌంచముం జించినవి; ఈ శరములు శరజన్ము నొంచినవి; ఈ నారాచములు హైహయుల రుధిరముం గ్రోలినవి—



లక్ష్మ—ఇదే మీ జాతికిఁ గల సంరంభము! ఎందు కి యఱపు?

క. బూచి యని తెప్ప సూపి పి
శాచములం దోలఁ దలఁచు । చందంబున నా
రాచములు చదివి మము నహ
హా! చకితులఁ జేయఁ దలఁతు । త్ర్యంబకశిష్యా!

గీ. చాలు నిది కంఠ ఘోషము! । సమర రతులు
జడియుదు రె రాచబిడ్డలు । సాయకాఖ్య
లేవొ చదివిన మాత్రాన? । నెవ్వ రెఱుఁగ
రననిదివిజులు ధ్వని సారు । లన్నమాట?.

పర—సారెసారెకు రాచ పీఁచ మడఁచిన వీఁ డుత్త పొల్లే?

లక్ష్మ—చేవ గల వాఁ డన్ని తడవలు చేయి చేసికొనవలయునా?

పర—ఏమీ? చేవలేని జీలుగా వీఁడు? బాఁపఁడని చులకఁ జేయు చున్నావు.

గీ. ఆజి వేళానుభూత స । హస్ర బాహుఁ
గాత్రవీక్ష్యఁ దునిమిన భా । ర్గవుఁడు వీఁడు
క్షత్రపశు యూథములఁ బట్టి । చంపుపట్టి
బ్రాహ్మణుఁడు గాఁడు కరవాఁడి । పచ్చి తురక.

ండు! రాచబిడ్డలు రణ పరికరము బిగింపుఁడు!

రాము—నా మనవి వినుఁడు!

ఉ. పెద్దలుమీరు; మేము మఱి । పిన్నల మెంతయు; మీకుమాకుఁ బె
న్నుద్దియె చేయి చేసికొన? । యుద్ధము వృద్ధ సుదుస్సహమ్ము; ము
న్నద్దిర! నాఁగఁ గొంటిరి జ । యమ్ము? వృథా విరసమ్ములేల యీ
సుద్దులు? కాల పాత్రములు । సూడుఁ డదే విధ మొప్పఁ దెప్పుడున్.

ర—పొట్టలు చించి పెకలించిన రాచప్రేవులతో యశఃపతాక

గల్పించుకొన్న ప్రమథనాథప్రథమాంతేవాసి పయోముఖ
విష కుంభములకు నీ పలుకులకుఁ బలుచపడఁడు.

రాము — ఆ పడగ యిప్పు డేల చింపుకొనియెదరు?

పర — నీవా చింపువాఁడవు?

క. నీ చేవ యెంత? నా నా
రాచమునకు వెఱచి కాదె బ్రహ్మను భవద
స్త్రాచార్యుఁడు గాధేయుఁడు
యాచించెను బ్రహ్మభూయ మను కవచంబున్.

రాము — ఎట్టెట్టూ? వినమైతిమి!

క. యాచించె నేమి నీనా
రాచమునకు వెఱచి యతఁడు బ్రహ్మను మా చా
పాచార్యుఁడు కౌశికుఁ? డౌ
రా! చూచెదఁ జూపు నీ శ రమ్మది యేదీ?

పర — రే! రే! యేమంటివి? పరశురాముని సాయకము పరీక్షించెదవా? మండుచున్న నా క్రోధానలమునకు విదేహ దిలీప వంశ్యు లెన్ని యాహుతు లవుదురు?

సీ. అంశుమద్వంశ్య సిం హాసనాధ్యాసుల
మని గర్వపడు ప్రభు త్వాఢ్యులార!
స్థాణవీయ ధనుర్వి దారణం బది సూచి
చరితార్థులయిన రా జన్యులార!
రైణుకేయుని కుఠా రపరిహారము లేక
క్రేళ్ళుబ్బు నృపతి వ ర్గిణులార!
ఆ చతూ రత్నాక రాంతంబు సమసి పు
నారూఢులయిన భూ నాథులార!



గీ. రండు మీ పురోధసులతో రణ ధరణికి
శస్త్ర నివహంబొ! బ్రహ్మ వ ర్చసమొ! యేదొ
సాఁకఁగలయది? హర శరా సన విపత్తు
నఱకుచున్నాఁడు రేణుకా నందనుండు.

రాము — ఓహో! జామదగ్న్య! యేల యీ సంరంభము? దూర దూరము సనకు!

చ. ఎదుటను లేని భూ విభుల నేటికిఁ గేరుచు మాటిమాటికిం
జదివెదు? నేను లేనె భుజ సార పరీక్షకు శైవ చాపముం
జిదిమినవాఁడ? హైహయునిఁ జేతులు సించిన బాహువేది? త
త్కదన విదగ్ధతాగుణము క్రమ్మఱఁ జూపుము నేఁడు సూచెదన్.

పర — అహహా! యేమి కాల మాహాత్మ్యము! భార్గవుని బాహు దండమును బాహుజుఁ డడుగుచున్నాఁడు. అరే! రామ! ఆదిట్టతనమునే వహింపు!

చ. రవికుల సార్థవాహులగు రాచ కొలమ్మునవారిలోపలం
గవచ హరుండ వైతి మఱి కౌశికుఁ డిచ్చిన వాఁడికోలతోఁ
గవిసి రణాభివక్త్రుఁడవు గమ్మ! నివృత్తుఁడ వయ్యెదేని యీ
యవగుణ వజ్రలేపమున కన్వయ మెల్లఁ గళంకితంబగున్.

రాము — లక్ష్మణా! విల్లిటు దెమ్ము!

పర — అరే! ఆవిల్లెందుకు నీకుఁ బ్రాకృతము?

శా. రారమ్మిమ్మయ్యది రాక్షసాంతక ధను రత్నంబు గైకొమ్ము! యు
ద్ధారంభాధ్వర కర్మదీక్షఁ గొను మా కార్త్వీజ్య ఘారేయమై
సారాఢ్యంబు కుఠార మున్నది ధను శ్శ్రద్ధాళురన్ దీనితోఁ
దోరింతుం దల లుత్తరించి మిము న స్తోకస్మయాధ్మాతులన్!.
(విల్లొసఁగు)

రాము — (అందుకొను.)

పర—ఇది వంచుటే కష్టము.

రాము—స్వామీ! అది యొక కష్టము కాదు గాని తరువాతి పని-

పర—బందుగు లేడ్చు నిక్కడెందుకు? సమయోచితప్రదేశమునకుఁ బోవుదము రమ్ము!

(నిష్క్రమింతురు.)

లక్ష్మి—(చూచి—ఆనందముతో)

చ. మృదుని శరాసనంబుక్రియ । మిక్కిలి యొత్తిన విష్ణుచాపముం
నడిమికి వ్రయ్యలౌనని మ । నంబున శంకితుఁడౌచు మెల్లనం
బిడికిటఁబట్టి యార్యుఁ డొగిఁ । బేశలయుక్తి నొనర్చి సజ్యముం
దొడిగి శరంబు భార్గవుని । త్రోవలు ద్రుంచె జగంబు మెచ్చఁగన్.

అన్నయు జామదగ్న్యుఁడు నిక్కడకు వచ్చుచున్నారు; ఏనుం జని విజయముఁ బురవీథులఁ జాటఁబంచి వచ్చెద. (నిష్క్రమించు.)

(పరశురాముఁడును రాముఁడును ప్రవేశింతురు.)

పర—(తనలో)

గీ. ఆశుగంబయి హరుని శ । రాసనంబు
త్రిపుర దాహంబు వేళఁ బూ । రించె నెవఁడు
వాఁడె కమలా విభుఁడు నేఁడు । వంచె దీని
వర్మహారుఁడయి పద్మాప్త । వంశ్యులందు.

(చుబుకము స్పృశించి) నాయనా! రామభద్ర! సిగ్గుపడి యెదవేమి?

గీ. దేనిఁ జూడంగఁ దలఁచి యీ । తీరున మతి
కోప మెక్కించితిని నీకుఁ । గ్రుద్ధునట్లు
వైష్ణవము నమ్మహామ్మ గీ । ర్వాణ నుతముఁ
జూచినాఁడను నీయందు । శుభ నిధాన!

రామ—(చేతులు జోడించుకొని)



ఉ. కయ్యము సేయ రమ్మనినఁ । గ్రమ్మఱ రాదది రాచపాడి యి
ట్లయ్యుఁ గకుత్థ్స వంశ్యులకృ । తాస్త్రులు భూసురులందు నెందు నీ
నెయ్య మెఱుంగ నేరకిటు । నెక్కొని దానికి శైశవంబుచేఁ
[illegible]స నియ్యకొంటి భృగు । సత్తమ! సైఁపఁగదయ్య తప్పులన్.

(ప్రణమిల్లు.)

పర—(లేవఁదీసి) తండ్రీ! రామభద్ర! ఆశీర్వచనము పునరుక్తము; అయిన నిట్లవుఁగాక!

చ. పిడుగులఁ జిమ్ము నీ విశిఖ । బృందము పేరిటి కారుచిచ్చులో
మిడుతలువోలె రక్కసులు । మృత్యుముఖంబును గాంత్రుగాక! యే
యిడుములు లేక యింక సుర । గేంద్ర నరేంద్ర సురేంద్ర సుందరుల్
గడు సుఖియింత్రుగాక కల । కాలము నీ యశమున్ నుతించుచున్!

(చెవిలో నేమేమో నొడువు.)

రాము—దేవరయాజ్ఞ శిరమున వహింతు!

పర—గురుజనము ప్రతీక్షించు, నీ వుండుము! ఆరణ్యకులము మే మిక్కడ నుండఁజనదు. (నిష్క్రమించు.)

రాము—పరశురామ భగవానులు వెడలిరి. ఏనుం దాతల సామీప్యమునకుం జనియెదను. (పరిక్రమించి—చూచి) ఇదిగోఁ దాత లిందే యున్నారు!

(జనకుఁడును దశరథుఁడును ప్రవేశింతురు)

జనకుఁడు—(ఆనందముతో) చిరకాలమునకు మరలఁ ద్రిభువనముం బ్రోచు క్షాత్రముం గంటిమి.

దశ—జరాభర దుర్వహమైన వర్ణాశ్రమ పరిరక్షణ భారమును రామునిపై నునిచి దిలీప కులోచిత పథమున నేను దపోవనమునకుఁ జనియెద.

రాము—(నమస్కరించు.)

దశ—(రాముం గౌఁగిలించుకొని) బావా! సీరధ్వజ! యీ జామదగ్న్య విజయావసరమే రామభద్ర పట్టాభిషేకమునకుఁ దగిన సమయము. అభ్యంతర మేమియుండు?

లక్ష్మ—(వచ్చి) ఇదిగో మధ్యమాంబ మంథరచేఁ బంపిన పత్రిక!

రాము—అంబకును బరివారమునకును గుశలమేకద! మన ప్రవాసము మనోవైకల్యమునకు మూలము.

జన—(పత్రికవిప్పి చదువు.) స్వస్తి! శ్రీ మహారాజ దశరథులకుఁ గైకేయి సేయు విజ్ఞాపనము. పూర్వమొసఁగిన వరము లవి రెండును దేవర యిప్పు డనుగ్రహించుఁగాత! అందొకటి భరతునకుఁ బట్టాభిషేకము; రెండవది సీతారామలక్ష్మణులకుఁ బదునాలుగేండ్లు వనవాసము.

(రాజులు మూర్ఛిల్లుదురు.)

లక్ష్మ—ఎట్టెట్టూ కైకమనోరథము? అగ్రజునకు నరణ్యవాసము నవరజునకుఁ బట్టాభిషేకమునా? తానెవరు తండ్రి యెవరది శాసించుటకు?

రాము—(తనలో) పరశురామ భగవానులు సెలవిచ్చినట్లు పుణ్యనదీ పరిసరములఁ దపోవిఘ్నములు సేయు దండకారణ్యనివాసుల దైత్యుల దండించు నుపాయ మరయు నాకు మా కైకమ్మ మంచిత్రోవఁ జూపినది. (ప్రకాశము) వత్సా! లక్ష్మణ! మీ వదినెతో నీవు ముందు నిలువుము! అనుపదమున నేనును వచ్చెద!

లక్ష్మ—అన్నా! అదేమిమాట!

ఉ. కేల నిఁకేల వాలు, క్షితి । కిఁక నినుఁ గాదని మధ్యముండు తా
నేలిక యైన నే నది స । హింతునె? చాలు భవత్తితిక్ష! ది



క్పాలు రెదిర్చినం జెనకి । పట్టముఁ గట్టెదఁ! గేక యాత్మజు
నాలుకఁ బట్టి కోసినను । నారక మున్నదె? సన్నుతింపరే?.

రాము—వత్సా! అట్లనెద వేల? ఆత్మగౌరవమువలెఁ బితృగౌరవము నభిరక్ష్యమేకద! కావునఁ బ్రతివచనము సెప్పక నా చెప్పినట్లు సేయుము!

లక్ష్మ—(నిష్క్రమించును.)

రాము—(చేలాంచలమున విసరుచు) తాతలారా! ఊఱడిల్లుఁడు!

జన—(ఊఱడిల్లి ఆకాశమున లక్ష్యముంచి) మేలు! కైకేయీ! మేలు! పత్యనుగమనము నా బిడ్డకుఁ బరమోపకార మనుగ్రహించితివి.

రాము—తాతా! తాత స్వాస్థ్యమునకుం బ్రయత్నింపుఁడు!

(నిష్క్రమించును.)

జన—(విమర్శించి విచారముతో)

ఉ. అమ్ములు విండ్లు పూను నస । హాయులు కుఱ్ఱలు; పోవుచెంచుమా
ర్గమ్ములు కైకసేయుని క । రమ్ములు వేంద్రముగొట్టు చోటులు
గ్రమ్ములు; నాదు బిడ్డ కసు । గందు; విషహ్యము కష్టరాశిగా
థమ్మ సమస్త మిమ్మెయిఁ గ । టా యెటు లేగుఁ జతుర్దశాబ్దముల్?

దశ—(ఉపశమిల్లి) నాయనా! రామభద్ర! ప్రీతిపాలింపుము నన్ను.

(జనకునిచే ధార్యమాణుఁడై నిష్క్రమించును.)

ఇది

శ్రీ బ్రహ్మానంద విరచితము జగదానందము

ద్వితీయాంకము.

---



శ్రీరస్తు.

బ్రహ్మానందీయము

# జగదానందము

## తృతీయాఙ్కము

(మారీచుఁడు ప్రవేశించును.)

మారీచుఁడు—ఎవరు దేనికి నియమింపఁబడుదురో ప్రభుహితైషులు వారది సేసి యూరకుండుట లెస్స. అటుగాక దానిలో స్వకార్యోద్ధరణ పరాయణులయ్యెదరేని యది ప్రాణగొడ్డము. మాయలాఁడి శూర్పణఖ "మంథరావేషమున నెల్లరఁ గన్నుమూసి సీతారాముల నడవికిఁ గొనిర" మ్మని మాల్యవంతుఁడు వ్రాసి యిచ్చిన చీటిలోఁ గామమోహితయై సౌమిత్రింగూడ నిఱికించి కొనివచ్చినది; మఱియు వానిమ్రోలఁ దన టక్కులు సాఁగక రాముని పైఁ గన్నువేసి సీతావేషముతోఁ దక్కుచుఁ దారుచుండ, రామవధార్థము శూర్పణఖకు సాయమంపఁబడిన విరాధుఁడది నిక్కపుసీతయని భ్రమించి మోహావివశుఁడై రామవేషముతో దానిననుగమింప లక్ష్మణుఁడది తెలిసికొని విరాధుని వధించి, స్త్రీయని కరుణించి శూర్పణఖను ముక్కుచెవులు గోసి విడిచి పుచ్చె. అది మూలముగా శూర్పణఖాప్రేరితులై ఖరదూషణాదులొక్క మొగిఁ గవిసి పదునాలుగువేల



పదునేడ్వురును రామశరానలమున శలభములై బూదియైరి. మొత్తముమీఁద రామలక్ష్మణుల బలపరాక్రమము లసాధారణములు. ధర్మైకపరాయణతయు నటువంటిది. భరతుఁడరుదెంచి "జరిగినదిసర్వము రాక్షసమాయయనియు తండ్రిపరలోకగతుఁడయ్యెననియు రాజ్యభారము వహింపనర్హుఁడు జ్యేష్ఠుఁడనియు" నతఁడెంత సెప్పినను వినక "అన్నమాట తప్పరాదనియు నరణ్యావాసము పదునాలుగేండ్లునుం దనకుఁ బదునాలుగు నిముసము లనియు నందనుకఁ దన పాదుకలు ప్రతినిధులుగాఁ బ్రజాపాలనము గావింపుమనియుఁ" జెప్పి పంపెనఁట. తత్తాదృగ్ధర్మ పరాక్రమ సంపన్నుండు గావుననే రాముని యెడఁ దృణీకృతబృందారకుఁడు దశముఖుఁడును వీర విక్రమవిహార విముఖుఁడై చౌర్యమునకుం గడంగి ముందు నన్నుం బుత్తెంచె. ఏదో కైతవమున నే నిప్పుడు రాజపుత్రులను దూరముగాఁ గొనిపోయిన మా దశాననమహారాజు తాసంతలోఁ జనుదెంచి సీతను లంకకుం గొనిపోఁగలఁడు! మఱియు జటాయువను పక్షీంద్రుఁ డిచ్చట దాశరథులకు సహాయుఁడై యున్నవాఁడట! అన్నను సంపాతిం గొల్చి వచ్చుట కిప్పు డాతఁడును మలయాచల కులాయమునకుం జనియె; నా చేయు మోసమున కిదియ సమయము! కాని నాఁడు నాటిన రామనారాచముం దలంచుకొన్న గుండె లవియుచున్నవి; ఏమయినను స్వామి నియోగము సేయక తీరదు; అదె పర్ణశాల వారే సీతారాములు! నా పనికి నేనుఁ బ్రయత్నింతు.

(నిష్క్రమించు)

(సీతారాములు ప్రవేశింతురు.)

సీత—సౌమిత్రి సేయు సపర్యలవలనను జటాయువుతోడి చెలిమివలనను మన కీ యరణ్యావాస మవిదితమై చనుచున్నయది.

రాము—అవును! అయినను మృదు మధుర వినోదములతో సుందర
శుద్ధాంత భాగములఁ బ్రొద్దుపుచ్చు పువుఁబోఁడివి—

సీత—దేవర సాన్నిధ్య వశంబున నాకు నగరవాసమునకంటె నరణ్య
వాసమే శ్లాఘాపాత్రము.

సీ. నళినలోచనలకి । న్నరపాట రుచి యానె
శ్రుతులకు నెలదేఁటి । రుతులు విన్న?
కరి కలభాధూత । కర్ణధ్వనుల మ్రోల
మాననీయంబులే । మర్దళములు?
పౌరబాలా నాట్య । పరిపాటు లవి యెంత
సానంద కేకి లా । స్యముల చెంత?
పాయసంబున కేమి । పరువును మరియాద
పచ్చి తేనియలతోఁ । బట్టి చూడ
గీ. సహజ సౌందర్య రుచిరాండ । జముల సరస
సాలభంజిక లేటికి? । సౌధములకుఁ
జాలవే పేశలాశ్మ వే । శ్మములు? ప్రభలఁ
దెగడుఁగద మహౌషధులు ప్ర । దీపములను!

రాము—దేవీ! నీ సాహచర్యమున నాకును—

సీత—సహజ సౌందర్య తటినీ తరు మృగ ఖగములు గల యీ వన
ప్రదేశము లతి మనోహరములు.

రాము—అవు నట్టులే!

సీ. వీచీ తుషార స । న్ధీచీనములు చూడు
మగువ! గోదావరీ । మారుతములు!
చేతోభవక్రీత । కేతకీకము లవి
కచ్ఛంబులం గంటె । కంబు కంఠి!



కేకాకులప్రచ । లాకి సంశ్రయములు
పారిప్లవాక్షి! యా । పర్వతములు
సౌరభాహూతాళి । వారంబు లవి యిందు
మంజులానన! లతా । మందిరములు
గీ. నీలజీమూతముల భంగి । నింగిఁ గప్పి
పొదలునవి యెల్లఁ దాపింఛ । భూరుహములు
కలికి! కండూల కరటి వి । ఘట్టితములు
సరళము లవి ప్రసుతపయ । స్సారభములు.

(తమకముతో)

సీ. ఆడుచున్నది కేకి । చూడు నీ కేశపా
శము సేవ సేయఁ బిం । ఛమును విప్పి!
పాడుచున్నవి గుమి । గూడి కేసరముపై
నళులు నీ నయన క । ల్యాణములను
కూయుచున్నవి యెల । గోయిల లవి నీదు
వచనామృతముఁ గ్రోల । వచ్చినట్లు
డాయుచున్నవి దృష్టి । పేయంబులై నీర
శనపోల్కి హంసలు । సైకతములఁ
గీ. బర్హిషవిల్లెడుఁ గురవక । ప్రసవగుచ్ఛ
మదిగో భవదాస్యమునకు విం । దవువిధానఁ
బుణ్య లక్ష్మీక మిది వనా । భోగ మెల్ల
నంబురుహ విలోచన! ప్రమో । దావహంబు.

సీత—తమ రన్నట్టులు సర్వము సంతోషావహము.

శా. ఈ గోదావరి లోకపావని, కదుర్గ । హృద్యంబులౌ పుష్పలిట్
పూగంబుల్ గల యీ నికుంజములు, నం । భోభృత్ప్రతీకాశముల్

నాగంబుల్ పెనుపారు నీ నగము, నా । నందప్రదంబై పురా
భోగంబుల్ మఱపించు దివ్యసుషమా । భూయిష్ఠమై యొప్పుచున్

రాము—(ఔత్సుక్యముతో) లలనా! లలితేందువదన!

గీ. శైలజా వల్లభుని శరా । సనముకంటె
రైణుకేయుని శిత కుఠా । రమునకంటె
దృఢము పుండ్రేక్షు దండంబు । తీక్ష్ణములు ప్ర
సూనములు నిందు నవలతా । సుందరాంగి!

సీత—(తనలో) ఆర్యపుత్రుని చేత మన్యథావృత్తి యవుచున్నది. యింకొక చక్కికిఁ ద్రిప్పెద. (ప్రకాశము) విమల కోమలి దంష్ట్రాముకుళ కరాళాతివిశాలాననములును శరజ్యోత్స్నా సహచర శరీర శోభా చకచకలును గల యవి యేమృగములు?

రాము—దేవీ! అవి సింహ శాబములు.

సీత—చంద్రోదయక్షణక్షుభిత దుగ్ధార్ణవ సంజనిత ఫేనపుంజ ధవళములును విలోలములు నగు దీర్ఘవాలములు గల యవి?

రాము—ఆ మృగరాజ పోతములకు భయపడి పఱచు చమరులవి.

సీత—(ఆనందముతో) అదిగో! ఆ కర్ణికారములవంక నవలోకింపుఁడు!

రాము—(అవలోకించి) సువర్ణ హరిణము.

సీత—చూచితిరా యెంత ముద్దుగ నున్నదో? కాలయాపనమున కనుకూలముగ నుండు! పట్టుకొనుఁడు!

రాము—లక్ష్మణా! విల్లు—

లక్ష్మణుఁడు—(ప్రవేశించి) ఆర్యా! యిదిగో! విల్లెందులకు?

రాము—(విల్లందికొని) అదిగో నయ్యేణముం జూడుము.

లక్ష్మ—(చూచి) అన్నా! యేదో యిది కడు వింత.

సీ. వజ్రనికాయాభి । వర్ధిత ముదరంబు
దళితేంద్ర మణి చిత్రి । తములు సెవులు



వైదూర్యములతోడి । వావులు ఖురములు
కలధౌత బిందు ము । గ్ధములు పొడలు
తమ్మియుం దొగయు నం । దము మూతి చందము
ముక్తాకృతి విషాణ । ముల విరచన
ప్రావృణ్ణిలింప చా । ప నిభంబు పుచ్ఛంబు
సంవర్త శిఖి శిఖా । సదృశి రశన

గీ. చొకళింతలు విద్యుదా । చ్ఛాదితములు
సర్వ ముత్పథ వైచిత్ర్య । సంగతంబు
కనియు వినియు నెఱుంగని । కనక మృగము
మృగము గాదిది కైతవ । మృగము నిజము.

సీత—అదిగోఁ బోవుచున్నది! పోనిండు.

రాము—తమ్ముఁడా! అది యేమయినను మీవదినె మిగుల నాదట పడుచున్నది; మృగమైనఁ బట్టి తెచ్చెదఁ గాదేని తోలొలిచి తెచ్చెద; జానకీ పరిరక్షణమున నీ వప్రమత్తుఁడవయి యుండుము! (సీతవైపుఁజూచి) వెడలుచున్నాను.

(నిష్క్రమించును.)

లక్ష్మ—అమ్మా! అది మాయ గాని మఱియొకటి గాదు.

సీత—నాకును మఱి యిప్పు డట్లే తోఁచుచున్నది. అదిగాక నా హృదయ మదేమో వికల మవుచున్నది.

లక్ష్మ—అమ్మా! వైకల్యమున కేమిపని? అన్నగారి వింటికి నసాధ్య మెయ్యది?

(తెరలో) హా! సీతా! లక్ష్మణ!

సీత—(వినుట నభినయించి) హా! చచ్చితి! అయ్యో! నాథా! నా మూలమున నీ కెట్టి చేటు వాటిల్లినది! ఏ దుష్టరాక్షసుల పాలయితివి!

లక్ష్మ—తల్లీ! భయపడకు! మున్నే చెప్పితి నేనిది రాక్షస మాయ
యని. ఈ వికృతస్వరము రాక్షసునిది గాని మా యన్నదిగాదు!
సీత—అన్నా! లక్ష్మణ! అట్లనకు! నే నెఱుఁగుదు నది మీ యన్న
గారి కంఠస్వరము.
లక్ష్మ—తల్లీ! వేగిరపడక యించుక నిదానింపుము!

సీ. వేయేనుఁగుల లావు । వెలుఁగొందు కూళ రా
క్షసినిఁ జంపిన విల । క్షణ బలుండు
దోష్మంతు లెవరు శ । క్తులు గాని హర చాప
మును మోపి విఱిచిన । భూరి భుజుఁడు
కాలానలప్రతీ । కాశు భార్గవు రాము
దర్ప మార్చిన సుప్ర । తాప ధనుఁడు
ఖరదూషణాది రా । క్షస యూథము నొకండ
కెరలి గీఁటడఁచిన । కృతకరుండు
గీ. పరగ నుద్ధతమై విష్ట । పత్రయంబు
వచ్చి పైబడ్డ నిజ శర । వహ్ని వ్రేల్చి
నీఱు గావించు దివ్యాస్త్ర । నిధి సహస్ర
భాను కులవల్లభున కేమి । భయముతల్లి!

మఱియు

శా. ద్యావాభూములు బీటవాఱిన; దిశా । హస్తీంద్రముల్ క్రుంగినం
ద్రోవల్‌దప్పిన భానుసోములు; మహా । బ్ధుల్ దప్పి గొన్నం; గుల
గ్రావంబుల్ చలియించినం; ద్రుటిశే మ । ర్యాదంబుతో వర్ణముల్
రావిమ్మాడ్కివి నోట మాఁకు; హరిణ । క్రవ్యాద నిర్వాంతముల్.

సీత—నా తండ్రీ! కాలహరణముఁ గావింపక చనుము! చన వేని యురి
వోసికొని యిప్పుడే యుసుఱులు వాసెద.

(ఉరివెట్టుకొనఁ బోవును)



లక్ష్మ—వలదువలదు! ఇదిగో నేను వెడలుచున్నాను. వనదేవతలు
నిన్ను రక్షింత్రుగాక! పర్ణశాలలోనికిఁ జనుము! (కల
యజూచి)

సీ. అర్కవంశ్యుల కోడ । లఘు విదూర సుశీల
ధరణిజఁ గావుఁడీ । తరువులార!
నిష్కలంక చరిత్రి । నిమిభూపతుల యాఁడు
పడుచు రక్షింపుఁడీ । పక్షులార!
పతిపరాయణ పర । భాగ పావని యని
మిష వంద్య బ్రోవుఁడీ । మృగములార!
యజన సంభవ దేవి । యభివర్ణి తాచార
సతి యేమఱిలకుఁడీ । సరసులార!
గీ. తాటకాసూదనుని రాణి । ధర్మనిరత
దయ వహింపుఁడు । తాపస తరుణులార!
భూరి గుణ గణ్య భువనైక । పుణ్యరాశి
జానకిని నోముఁడీ సుర । స్వాములార!

(నిష్క్రమించును.)

(తెరలో)

(కవిరాజవిరాజితము)

జయ! జయ! శంకర! యీశ! శివా! హర । శైలసుతా దృతసంసరణా!
నియమిత సృష్టివిశేష! జటాభర । ణీకృత బాలసుధాకిరణా!
దయవహియింపు! పురత్రయ ఘస్మర । ధన్యనొనర్పు భవచ్చరణా
శ్రయు నను! వహ్నివిలోచన! సారవి । చారణ భక్తజనోద్ధరణా!

సీత—భువనపావను లెవరో శివభాగవతులు వచ్చుచున్నవారు.

(భిక్షువు ప్రవేశించు.)

భిక్షువు—(సీతంజూచి—తనలో) నాటికి నేఁడు మరలఁజూచితి.

సీత—(తనలో) ఇవ్విపినమునకు మున్నెవ్వరు నిట్టి భిక్షువులు రాలేదు. మగవారును సమయమునకు లేరయిరి. తపోధను లలిగిన శపియింత్రు! (ప్రకాశము) అయ్యా! యిదుగోఁ బాద్యము! ఇదిగో బ్రుసి. దయసేయుఁడు!

భిక్షు—(కూర్చుండి) నీ సుకృతము మిక్కిలి చక్కనిది.

ఉ. చూచితి నాగమానినులఁ । జూచితి మర్త్య మరాళ యానలం
జూచితి ఖేచరాంగనలఁ । జూచితి నాక తటిల్లతాంగులం
జూచితి సృష్టిలో వెలయు । సుందరులం జకితైణ నేత్రలం
జూచితి నెందుఁ జూచినను । జూడను నీ కెన యైన సుందరిన్

కోమలీ! ఘోర కాంతారమున నేకాకినివై యున్న నీ చరిత మది సుంత వినఁవలతు.

సీత—అయ్యా! అవధరింపుఁడు!

సీ. ఆరాధనీయ స । త్యాధార భగవతి
సర్వంసహాదేవి । జనని నాకు
వాచంయమోత్తంస । వంద్యుఁ డున్నతుఁడు త
పోరాశి జనక భూ । భుజుఁడు తండ్రి
ఖరదూషణాది రా । క్షస నిషూదనుఁ డల్ల
నళినాప్త కులుఁడు ప్రా । ణప్రియుండు
చుప్పనాతికి ముక్కు । చులకఁ జేసినవాఁడ
మిత్ర విధ్వంసి సౌ । మిత్రి మఱఁది

గీ. తండ్రియానతిఁ దలఁదాల్చి । దాశరథులు
భద్రమూర్తులు కార్ముక । పాణులవుచు
వచ్చి యున్నారు వా రని । వార్య వీర్య
సేవధులు మఱి నా పేరు । సీత యండ్రు.



వారును గురంగము వెంబడి నిప్పుడ దవ్వులం జనిరి. ముహూర్త మాత్రంబునం జనుదెంచి మిమ్ము సపర్యా సంతృప్తులం జేయుదురు.

భిక్షు—ఆహా! తుహినాంశు వదన!

ఉ. హాయిగఁ గేళి హర్మ్యముల । యందు వసింపఁగ నర్హమైన యీ
ప్రాయమునందు నిన్నెవఁడ । రణ్యమునం దిటుద్రిప్పఁ దాఁ బశు
ప్రాయుఁడు గాక యున్న మఱి? । పాప మకృత్రిమ బుద్ధి వీవునుం
బాయక తోడ వచ్చితివి । భర్త యటంచుఁ గరంబుఁ జేలవై.

కోమలాంగీ! నీ దురవస్థకు నాకు మిగుల విషాద మయ్యెడి.

సీ. మోము పున్నమ చంద । మామకంటె సుతార
ముష్ణాంశు తాపంబు । నోర్చు టెట్లు?
కుసుమ రాసులయందుఁ । గసుగందు పాదాలు
సంచార మెటు లశ్మ । సరణులందు?
శుభసౌరభ జలంబు । లభిషేకమగు కైశ్య
మద్రి కుల్యలఁ దీర్థ । మాడు టెట్లు?
బంగారు పాలపొం । గుం గాంచు మైదీఁగ
వేఁడిగాడ్పులయందు । వేఁగు టెట్లు?

గీ. సుందరములైన మాణిక్య । మందిరముల
మన్ననలఁ గాంచఁ దగు సౌకు । మార్యవతివి
గహనమునయందు భూధర । కుహరమందుఁ
గటకటా! యాకుటింటనా । కాఁపురంబు?

సీత—తమ రెఱుఁగని ధర్మములు లేవు. పతిపాదసేవయే కద సతులకుఁ బరమ ధర్మము!

భిక్షు—ఉత్త వెఱ్ఱిదానవు.

క. నగలా? నాణెములా? మఱి
వగలాఁడికి నీకు శుద్ధ । వైఖానసుఁ డీ
మగఁడేచట దాపరించెను ?
మగువలు సరివారు నవ్వ । మద గజ గమనా!.

సీత—అయ్యా! పుణ్యపురుషా ! అట్లు సెలవిచ్చెద రేమి ? పతియే కద పరదైవము పతివ్రతలకు !

భిక్షు—(చిఱునవ్వు నవ్వు.)

సీత—(తనలో) ఇదేమి విషపు నవ్వు?

గీ. లక్షణంబులు భిక్షురూప । లక్షితములు
వర్తనంబులు విట సంప్ర । వర్తితములు
నొసలు బత్తుఁడు తోఁడేలు । నోరటన్న
పగిదిఁ జూపట్టు నెవ్వాఁడో । పాపి వీఁడు.

భిక్షు—రామా! రాజ రేఖాభి రామా! చల్లకు వచ్చి ముంత దాఁచనేల? విను నా ప్రవృత్తి!

సీ. జలజగర్భునిఁ దప । శ్శర్యచే మెప్పించి
వరములు గొంటి న । వ్వారి గాఁగ
గణములతోఁ గూడఁ । గైలాసమూపితిఁ
బార్వతీ భవులు కం । పము వహింపఁ
జూఱలాడితి బల । సూదనాదులను ది
గ్విభులనోడించి త్రి । విష్టపంబుఁ
గలరు నా వశమునం । ఘటచేటులై మర్త్య
భుజగ గీర్వాణ బి । బ్బోకవతులు

గీ. శైవలిని లాగు నగములు । సంచలించు
ననిలుఁడు వడంకుఁ బొగచూరు । నగ్ని మఱియు



వెఱచు సర్వము నా పేరు । విన్నమాత్ర
రాక్షసాధీశ్వరుండను । రావణుఁడను.

(భిక్షువు రావణుఁడగును.)

సీత—(తనలో) అమ్మో! చచ్చితిని! భక్తుడనుకొన్న వీఁడు పదితలల పలభుజుఁడు.

రావ—నారీమణీ! నాఁడు స్వయంవరమునపుడు నిన్నుఁ జూచినది మొదలు—

సీ. సహకార కిసలయా । స్వాదార్ద్రి పికగీత
ములకుఁ జేతులఁ జెవుల్ । మూసికొనుచు
వనితా శిరస్నాన । వాసిత దివసావ
సానములకు నమ । స్కారమనుచు
ధారాధరస్ఫుర । త్తటిదురుద్యుతులకుఁ
బ్రాణాలు పిడికిటఁ । బట్టుకొనుచు
నవరోధ ముక్త నీ । హారాంశు నిర్మల
జ్యోతిరూర్మికలకు । నుస్సురనుచు

గీ. యామిని గతించునా దైవ । మాయటంచు
నసమ విశిఖుని బారికి । నగ్గమవుచు
భిట్టు వగఁగొంచు నిన్ను జ । పించుకొనుచుఁ
గడపుకొనుచుంటి గడియ యు । గంబు పగిది.

ముల్లోకములం గెల్చిన మొనగాఁడనయ్యు నీ నిమిత్తము గుసుమాయుధునకుం గుఱియైతి. నా నిదేశమున మంధరా వేషము వహించి శూర్పణఖ మిమ్ము నీయరణ్యానికిం గొనివచ్చినది. మఱియు నీవు భ్రమసిన కనకమృగమది మా మారీచుఁడు నాఁడు దెలియమి నన్ను బహిష్కరించినను నే నది పరిగణింప. నమ్ము నా మాట

సీ. ఇందిందిరంబులై । యింద్రనీలంబులై
నీల మేఘములైన । నీదు కురులు
తమ్ములై మీనావ । తారమ్ములై యేణ
లోలమ్ము లయిన నీ । లోచనమ్ము
లందమై చందమై । యమృతాంశు బింబమై
యతి ముగ్ధమైన నీ । యాననంబు
పచ్చిబంగారమై । పసుపుఁ గ్రొంజాయయై
మెఱుపునా నొప్పు నీ । మేని యొఱపు
గీ. కాంచి వీక్షించి తిలకించి । కని కరంబు
కామదాసుఁడ నయితి ని । క్కముగ నీకుఁ
దక్షిణాఁడను నాయందు । దయ వహింపు!
తాళఁజాలను మదగజో । త్తంస గమన!

సీత—ఓ రావణ! నీ యట్టి సత్కుల సంజాతున కిట్టి దార్ష్ట్యము తగదు.

సీ. పుట్టినాఁడవు పూర్వ । పుణ్యవైభవముచే
బ్రహ్మవంశమున వి । శ్రవునివలన
సలిపినాఁడవు చంద్ర । శకల కోటీరుండు
తలయూఁచి మెచ్చుకోఁ । దగిన తపము
గెల్చినాఁడవు కచా । కృష్టి గావించి జం
భారాతి ముఖ్యుల । నమర వరుల
నిల్పినాఁడవు లంక । నిఖిల మేకాతప
త్రము నాఁగ బాహావి । తర్దియందు
గీ. నీదృశైశ్వర్య విభవ భూ । యిష్ఠునకు ని
దేమి దుర్బుద్ధి నీకు? దై । త్యేంద్ర! వినుము!



కుజము చెడువేళ దానికిఁ । గుక్కమూతి
పిందె యనియెడు చందముం । బెరసి చెడకు!

రావణా! అదియునుంగాక.

సీ. పంకజానన లంచుఁ । బాటలాధర లంచు
నణుమధ్య లనుచు నే । ణాక్షు లనుచుఁ
గుసుమ కోమల లంచుఁ । గుటిల కుంతల లంచు
సుదతు లటంచు సు । శ్రోణు లనుచు
రత్న దీపిక లంచు । రంభోరు లనుచుఁ బి
కాలాపినులటంచు । నబల లనుచు
గజగామినులటంచుఁ । గాంచన పాంచాలి
కలటంచుఁ గర్పూర । గంధు లనుచు
గీ. తారలంచును మెఱుపుల । తళుకు లనుచుఁ
బూవుఁదీవ లంచుం దియ్య । బోఁడు లనుచుఁ
బ్రాఁకులాడుదు రజ్ఞులు । పడఁతు లన్న
హేయ మల భాండములు గారె । యెఱిఁగికొన్న.

రావ—ఏటి మాట లివి? నా మాట విను!

సీ. మణి చంద్రకిత హేమ । మందిరంబులయందుఁ
జక్రాంగ తూలికా । శయ్యలందు
నిత్య పుష్పోల్లాస । నిష్కుటంబులయందు
ధాతుమ త్కేళి భూ । ధరములందు
సుభగ సోపాన భా । సుర దీర్ఘికలయందు
నభిమత గంధవా । హములయందుఁ
బట్టమహిషులు భువన సౌ । భాగ్యవతులుఁ
జతుర లెవ్వరుఁ బడయని । సౌఖ్యములను

బహువిధ వినోదములతోడఁ । బడయవచ్చు
రమ్మ! లంకకు వేగ మ । రాళ గమన!

సీత—ఓరీ! దుష్టనిశాట! నీకు మరణ మాసన్న మైనది.

సీ. ఘన శిలా కల్పిత । గ్రైవేయుఁడై వారి
ధిం దరింపఁగ నడ్మ । దిగినయట్లు
జాతవేదశ్శిఖం । జపలుఁడై పరిధాన
మునయందు మూటగా । ముడిచినట్లు
డోలా విహార క । ళోరాభిలాషుఁడై
పులి మీసములు చేతఁ । బుడికినట్లు
మహాఆదీప్తిస్ఫుర । న్మణిఁ జూచి భ్రాంతుఁడై
యాశీవిషమును ము । ద్దాడినట్లు
గీ. కావరమునఁ గ్రిందును మీఁదుఁ । గాన కిట్లు
మోహ వశమున మతి మలి । ల్లుచుఁడ వగుచు
రాఘవాగ్రణి ధర్మ దా । రం గలంపఁ
దలఁచుచున్నావు పదియు నీ । తలలు పగుల.

రావ—ఉత్తగోల వింకను రావణునికంటె రాముఁడు బలవంతుఁ డనుకొనుచున్న దానవు! సురాసుర కోటి కోటీర కోటి ఘటిత మణి నికర నీరాజిత పాదపీఠుఁడు వీఁ డెక్కడ? కూడుగుడ్డలు లేక కారడవిం దిరుగు వాఁ డెక్కడ?

సీత—రామునకును నీకును హస్తి మశకాంతరము. కావున—

గీ. తాటక మదించి పోయిన । దారిఁ బోకు!
ఖరుఁడు గర్వించి చన్న మా । ర్గమునఁ జనకు!
బ్రతుకఁ దలఁచెద వేని దు । ర్భావ లుడిగి
రాముని జపించుకొను! సురా । రాధ్యుఁ డతఁడు.

రావ—సుదతీ! యిది విను కడపటి సారాంశము!



క. ఉమ చరణము స్త్రైణంబని
ప్రమదప్రభు పాదమునకె । ప్రణమిల్లిన యీ
సుమహాభిమాని నీ చర
ణములకుఁ గావించుఁ దాఁ బ్ర । ణామ శతంబున్.

సీత—అట్టి భగవద్భక్తునకు నీ కిది యేమి బుద్ధి?

రావ—

క. మోహాధర! యేటికి సం
శోచము? నా వంకఁ జూడు! । కువలయ నయనా

సీత—

ఛీ! ఛీ! దూరముగాఁ బో!
నీచా! సిగ్గేలలేదు । నీతిఁ దొలంగన్?.

రావ—పొమ్మనఁగానే పోవుటకు వెఱ్ఱిరాముఁడు గాఁడువీఁడు—

సీత—పోకున్న బూది యయ్యెదవు!

రావ—ఆలాగేమి? యిదిగో! నిన్నిప్పుడీ యరదముపై నెక్కించుకొని చనియెద!

(అరద మవతరిల్లు)

సీత—అమ్మో! యిదెక్కడి మాయా రథము? హా! యిఁక నా కెవరు దిక్కు?

సీ. శ్రీరామునకుఁ జెప్ప । రేమీరు నా వార్త
దండంబు మీకు భూ । ధరములార!
యీ జాడ సౌమిత్రి । కెఱిఁగింపరే మీరు
వనదైవతములార! । వందనంబు
వేగ నా పతికిఁ బ్ర । వృత్తి సూచింపుఁడీ!
మీకు మ్రొక్కెద వన్య । మృగములార!

మఱంది లక్ష్మణునితో । మఱిమఱి నొడువుఁడీ!
కరములు జోడింతు । ఖగములార!

గీ. పంచవటి! నీవు పిలువుము । ప్రాణవిభునిఁ
దల్లి! గోదావరీ! నీవు । దయవహింపు!
సతత గతులార! గగన । సంచారులార!
దాశరథులకుఁ దెలుపుఁడీ । దైత్య నికృతి!

(లోనికిఁ జను.)

రావ—(ఔద్ధత్యముతోఁ జేతులు సారించి)

గీ. రమ్ము! వేవేగ నోరోరి । రాచవాఁడ
రామ! నీ పుస్తెగట్టిన । రామ నిపుడు
రావణుఁడు పర్ణశాలతో । రసఁ బెకల్చి
నెట్టుకొని పోవుచున్నాఁడు । నిజ నగరికి.

(యథోక్తముగ నిష్క్రమించును.)

ఇది
బ్రహ్మానంద విరచితము జగదానందము
తృతీయాఙ్కము.





శ్రీరస్తు

బ్రహ్మానందీయము

# జగదానందము

## చతుర్థాంకము

(లక్ష్మణుఁడు ప్రవేశించు.)

లక్ష్మ—అహో! దుర్నివార దారుణ క్రోధ శోక లజ్జా గహన, మీ దశా వివర్త మనోపాయికము. మాయా కురంగ మయిన మారీచునిం దునిమి సీతాదేవిం గానక పరిభ్రమించునది మొద లార్యుఁ డాఁపరాని దుఃఖార్ణవమున మునుఁగుచున్నవాఁడు. (తెర కెదురు మోమై) ఆర్యా! మారీచమథన! యిట్టిటు! దక్షిణముగాఁ బెరిగిన వింధ్య నగ మహారణ్య వీధు లివి.

రాముఁడు—(ప్రవేశించి)

సీ. రాలేదు గద మయూ । రములార! యీ ధరా
ధరము చెంతకు వసు । ధా కుమారి?
నిమిరాజ తనయ నీ । నికట వాటులయందుఁ
జూడరు గద మీరు । శుకములార?
కాంచరు గద మీరు । కలహంసలార! సీ
తాదేవి నీ సైక । తములయందు?

పుష్పంధయములార! । పూవుటీరములందుఁ
దెలియరె మీరు వై । దేహి జాడ?

గీ. గహన వీథులఁ దిరుగు మృ । గంబులార!
గగన మార్గమునం బోవు । ఖగములార!
చకిత మృగ విలోచన శర । చ్చంద్ర వదన
జానకిం గానరు గద యే । చక్కి నయిన?

మందభాగ్యుఁడ నయిన నా మాట కొకరును బ్రత్యుత్తర మీయకున్నారు.

లక్ష్మ—అన్నా! యీ శిఖావలముం జూడుము!

రాము—(చూచి)

మ. జలకంబాడి ఋజూకరించుతఱిఁ గై । శ్యంబున్ విలోకించి యి
మ్ముల భావత్కము వారివాహమని స । మ్మోహంబుతో నిట్టి దే
లలి నీ పెంచిన కేకి కేక లొలయన్ । లాస్యంబు సేయంగఁ ద
త్కలనం గౌతుక మొందుదానవు గదా! । కాంతామణీ! జానకీ!

లక్ష్మ—అన్నా! యీ కోకిల కూజితము వినుము!

రాము—(శ్రవణ మభినయించి)

శా. అన్నా! యీవు వచింపు మన్యభృత! నా । యర్ధాంగి చందంబు,నీ
చిన్నెల్ తోఁచెడి దేవిఁ జూచినటు! సు । స్నిగ్ధంబులౌ నీ నుడుల్
విన్నన్ జానకిమాట లచ్చు మవియే । విన్నట్టులుండెన్ గళం
బున్నికిమ్మెయి దిద్ది తా వెడలెన । ప్పూవుబోఁడి యే చక్కికిన్?

(దూరమునఁ జూచి—సమీపమునకుం జని-వైలక్ష్యముతో)

హాంతే!

సీ. కుసుమ గుచ్ఛ ప్రభాం । కుర విజృంభణములు
శీతాంశువదన సు । స్మితము లనుచు



మధుపాన మత్త భ్ర । మర కూజితంబులు
పరభృతాలాపిని । పలుకు లనుచు
మాణిక్య శకల తా । మ్రి కిసాలయంబులు
వివృతాబ్జపాణి చే । వ్రేళు లనుచు
గంధవాహ కిశోర । కంపిత నవమాలి
కా లత నా ప్రాణ । కాంత యనుచు

గీ. భ్రాంతి నొందితి వ్యామోహ । పరవశుండ
నయితి దిగ్భిత్తికల నవి । ద్యా విశేష
ఘటిత సీతా శతంబును । గాంచుచుంటిఁ
గాని నిజసీతఁ గాన నీ । కాన నెచట.

లక్ష్మ—అన్నా! దేవీ ప్రవృత్తిం దెలుపునట్టు లా కురంగములు దక్షిణ దిశం దిలకించుచున్నవి.

రాము—చని చూతము రమ్మ!

లక్ష్మ—(పరిక్రమించి) ఆర్యా! యివి చూడుము!

రాము—(చూచి) జానకికి నే నొసంగిన మాల్యము లివి; సౌరభ లోభమున మిళిందములు పరివేష్టింప నలుఁగుడువడి పుడమిం బడియున్నవి. (దుఃఖముతో)

శా. హా! దేవీ! హరిణేక్షణా! । గుణమణీ! హా! చంచరీకాలకా
శ్రీదంతావళ యాన! కుంద రదనా! । శీతాంశు బింబాననా
యేదైతేయుఁడు మోసనేసెఁ దెగితా । నుద్వృత్తుఁడై యిమ్మెః
వేదవ్యాహృతిఁబోని పావనిని నిన్ । విశ్వంభరా సంభవన్?

లక్ష్మ—అన్నా! యిది యరసి చూడుము!

ఉ. సారథి చచ్చెఁ జచ్చెను బి । శాచముఖంబులు రాసభంబులుం
దేరును వ్రయ్యలయ్యె మఱి । త్రెవ్వి పడెన్ ధనువున్ ధరాస్థలిం

జారు కిరీట రత్నములు । జాఱెను జాఱె భుజాంగదంబులున్
దారుణ సంగర క్రమము । తద్దయుఁ దోఁచుఁ దలంప నియ్యెడన్.

రాము—పిల్లిమ్ము! అదిగో! దానవుఁ డెవఁడో రక్త సిక్త గాత్రములతోఁ బక్షములు గల పర్వతమువలెఁ ద్రోవ కడ్డముగా నున్నాఁడు; వాఁడే వైదేహిం దిని యుండు! (తెరల్లో) నాయనా! రామభద్ర! జటాయువను నేనార్య సంపాతి పాదములకభివాదనము సేసి వచ్చుచుఁ ద్రోవలో నిక్కడ నీ దారం గొని పోవుచున్న తొలివేల్పుతో దుర మొనర్చి యిట్లయితి.

లక్ష్మ—దానవుఁడు గాఁడు; తాత జటాయువు.

రాము—(సమీపమునకుం జని) హా! తాతా! తాతప్రియసఖా! యెవఁ డా తొలివేల్పు? వాఁ డేదెసకుం జనియె?

(తెరలో) రావణుఁడు-లంక వైపునకు—

లక్ష్మ—హా! తాత జటాయువు మాటాడుచునే—

రాము—హా! తాత! శకుంతరాజ! యీవును మాకొఱకిట్టులయితివి.

లక్ష్మ—అన్నా! దుఃఖమునకు సమయము గాదు.

రాము—సీతాపహరణమువలనఁ బుట్టిన దుఃఖము శకుంతరాజ నిధనమువలన మఱింత పొరలుచున్నది.

లక్ష్మ—ఆపదలయందే ధైర్య కవచము—

రాము—(ఆకాశమున లక్ష్యముంచి) ఓరీ! రావణ!

శా. పాతాళంబున డాఁగినన్ సురపుర । ప్రాకారముం దూఱినన్
భూతేశున్ శరణంబు వేడినను దం । భోళి ప్రభూతాగ్ని ని
ర్ఘాతవ్రాత నిపాత దుస్సహము మ । త్కాండప్రకాండంబు ప్ర
ఖ్యాతంబయ్యదినిన్ గ్రసించునువిహం । గస్వామిత్రాచుంబలెన్.



లక్ష్మ—అన్నా! ఆ జగద్ద్రోహి నొక్కనిఁ జంపిన నేమి యగు? కూకటివేళ్ళతోఁ గులమెల్లఁ బెకలింపవలయు!

రాము—అవు నదే కర్తవ్యము; బ్రహ్మాస్త్రప్రయోగమున భూమండలము నిరాక్షసము జేసెద.

లక్ష్మ—అన్నా! స్త్రీబాలవృద్ధులు నిర్దోషులును నిహతులయ్యెదరు.

రాము—అవును! అందులకిప్పుడు మనము సేయవలసిన పని యేమి?

లక్ష్మ—దక్షిణదిశ నాక్రమించి చతురంగ బలోపేతు నహితు గర్వముఁగొన్న సుహృద్బంధు బలంబులతోఁ ద్రుంతము.

రాము—పిదప సర్వ మటులొనర్తము; ముందు మనకు నిర్వ్యాజ మహోపకారియైన శకుంతరాజును బరలోక సుఖప్రాప్తికి గిరినదీ తటమున సంస్కరించిరమ్ము!

లక్ష్మ—అటు గావించి వచ్చెద. (నిష్క్రమించును)

రాము—(గగనమున లక్ష్యముంచి)

శా. కానీ వంశమునం! బరాక్రమమునం । గానీ! తపస్సంపదం
గానీ! వెన్కనుముందు నీకు సదృశుల్ । గారెవ్వరుం బ్రాగ్రణుల్!
శ్రీనిర్ణేత విదేమి బుద్ధి? పరయో । షిచ్చౌర్య పాండిత్యమున్
మానంబే నినుఁబోఁటి విశ్రుతునకున్ । మందోదరీ వల్లభా!.

(తెరలో) ఓరీ! రాచ చిఱుత! ఆఁకొన్న నా సందిటం బడితివి—ఇఁక నెందుఁ బోఁగలవు?

రాము—ఎవఁడు వీఁడు లక్ష్మణు నొడిసి పట్టిన వాఁడు? (చూచి సంతోషముతో) తమ్ముఁ డా దానవుఁ జంపి వచ్చుచున్నాఁడు.

లక్ష్మణుఁడు ప్రవేశించును.

రాము—వత్సా! యెవఁ డా దానవుఁడు?

లక్ష్మ—యోజనబాహువు కబంధుఁడు.

(తెరలో) రామభద్రా! శాపవశంబున రాక్షసుఁడనయి మీచే విముక్తిం గాని పుణ్యలోకములకు జను నేను మీకుఁ జేయు నుపకార మిది.

క. సుగ్రీవాహ్వయుఁడు కపి
ప్రాగ్రసరుఁడు ఋశ్యమూక । పర్వతమున వీ
రగ్రామణులార! కలం
డాగ్రావము చెంత కేగు । డగును శుభంబుల్!

అల్లదె పంపాసరస్తటమునుండి ఋశ్యమూకమునకు మార్గము.

రాము—అటు ప్రవర్తించెదము. ఆర్యునకుఁ బుణ్యలోకము లప్రతిహతము లవునుగాక!

లక్ష్మ—(పరిక్రమించి) ఆర్యా! యిదే పంపా సరోవర వనోద్దేశము!

సీ. రమణఁ బుప్పొడి దుమా । రంబు నల్లడఁ గల
యఁగ వీచు మఱి మల । యానిలములు
పూవుఁదేనియలకై । పోరి గువ్వకోల్గాంచుఁ
దుమ్మెద లవియుఁ ద్రో । త్రోపు లాడుఁ
జిలికి నెత్తావుల । జిలిబిలి విరి తీఁగ
లధ్వనీనులకు నా । హ్లాద మొసఁగుఁ
బథము లియ్యవి యేణ । పద చంద్రకితములై
కుట్టిమంబుల కులు । కులు వహించు
గీ. సురుచి రోల్లోచముల రీతిఁ । జూత లతలు
సంత తోచ్ఛ్రయ చ్ఛాయల । సంతరించుఁ
గురియుఁ గర్ణామృతంబును । గొసరి కొసరి
కోకిలంబుల కువకువ । కూజితములు.

మఱియుఁ గుసుమిత లతా సంపర్కములం జేసి యానిలము



లయ్యు సరస్తోయావగాహములవలన సుభగములైన యిమ్మలయానిలమ్ము లాశాస్యములు.

రాము—(స్పర్శ మభినయించి- నిర్వేదముతో)

క. కాలాంతఃపుర ఖేల
ద్బాలా మృగనాభి గంధ । పంకిలములు దు
ర్వ్యాళములు క్రోలి యుమిసిన
కూళలునుం గాదె మలయ । కుధరానిలముల్?

(పంపా రామణీయకముం బరివిలోకించి)

హా! దేవి! దేవ యజనసంభవ!

సీ. శ్రీమంతములఁ బుండ । రీకంబులం గన్న
నేత్ర సౌందర్య ము । న్నెయె మవును
గలహంసముల కేళి । కలకలంబులు విన్నఁ
గాంచీ లతా ఘులం । ఘులలు తోఁచు
శైవాలమున రూప । సంపృక్తి నరసిన
ధమ్మిల్ల మదియు డెం । దమునఁ దవులు
సరస వీచీ విలా । సములు వీక్షించిన
భ్రూలతా విక్షేప । ములు స్ఫురించు
గీ. నే విశేషంబు లారసిన । నిచట నీ వి
శేష విషయంబులే తోఁచి । చిత్త ముత్త
లంబునం గ్రాగు దుఃఖ కీ । లలకు వేఁగి
ప్రేలు నసువులు పేలాలు । ప్రేలినట్లు.

లక్ష్మ—ఆర్యా! శల్యోద్ధరణము సుకరమై యుండ నిపుడీ విషాదమేల?

చ. ఇలఁ జతురర్ణవీ రశన । నే నొకరుండ ధనుర్ధరుండనై
గెలుతు! సపత్నవాహినుల । గీటడఁగించి; భవద్వధూమణిం

బొలుపుగ నీకుఁ గూర్తు! నను । బోఁటిసహోదరుఁడుండియిమ్మెయిం
గలఁక వహింపఁ జన్నె? రిపు । ఖండన! నీకెదురే పురారియున్.

రాము—ఏమి సేయుదు?

క. ఈ పుష్పద్రుమ వితతులు
నీ పరభృత కూజితములు । నీ మలయ మరు
ద్వ్యాపృతులు నూఁది యంత
స్తాపాసిత పథ శిఖా వి । తానముఁ బెంచున్.

ఇక్కడకు ఋశ్యమూక మెంత దూరమో?

లక్ష్మ—ఆ వచ్చు భిక్షువు నడిగి తెలిసికొనియెద.

(భిక్షువు ప్రవేశించు.)

భిక్షువు—(తనలో) ఋశ్య మూకము తనకుఁ జొర రాని దవుటంజేసి వాలి ప్రేరేపఁ దన్నుఁ జంప వచ్చిన బల్లిదు లని భయపడి నా స్వామి సుగ్రీవుఁడు వీరి నెఱిఁగి రమ్మని పంప భిక్షు వేషమున నిపు డిక్కడకు వచ్చితి. (విమర్శించి)

చ. అరి వినిషూదనంబులగు । నమ్ములు విండ్లు వహించి ఖడ్గముల్
కరమటు ఫూత్కరించు నుర । గమ్ములకై వడిఁ దేజరిల్లఁగాఁ
దిరిగెద రిందు వీరు జగ । తీత్రయ వంద్యులు సూర్యచంద్రులో!
హరిహరులో! బలారి సలి । లాధిపులో! మఱి యెవ్వరో విభుల్!.

లక్ష్మ—అయ్యా! సూర్యసుతుఁడు సుగ్రీవుఁడు వసియించు ఋశ్యమూక మెంతదూరమున నున్నది?

భిక్షు—(తనలో) మా యనుకొనినయట్టులు వాలి నిదేశమున మమ్ము మడియింప వచ్చిన వంచకు లేనా వీరు? (ఆలోచించి) ఇట్టి పరమ పావన మూర్తు లట్టి ద్రోహు లెందునుం గారు. (ప్రకాశముగా) అదే ఋశ్యమూకము! తమకు సుగ్రీవునితోఁ బని యేమి?



మ. అమరప్రఖ్య పవిత్ర మూర్తులు ప్రఫు । ల్లాబ్జాక్షు లాజాను దీ
ర్ఘ మహాబాహులు సంహతోరు కఠినో । రస్కుల్ గజారాతి వి
భ్రమణుల్ శత్రుసుదుస్సహాస్త్రులు ధను । ష్పాణుల్ దయాప్రోల్లస
ద్విమల స్వాంతులు మీ రదెవ్వరు జగ । ద్వీరాధివీరుల్ విభుల్?

లక్ష్మ—దాశరథులము. ఆర్యుఁడతఁడు రాముఁడు. నేను లక్ష్మణుఁడ. తండ్రిపంపున దండకాటవికిం జనుదెంచియున్న మేమింట లేని యపుడు రావణుఁ డిమ్మహాభాగుని భార్య నయోనిజం జౌర్యమునఁ గొనిపోవ నప్పరమ పతివ్రత నన్వేషించుచు మార్గమధ్యమున మాచే నిహతుఁడయి దేవతాకృతిం గొన్న కబంధుని మాట చొప్పున సుగ్రీవుని చెలిమి నపేక్షించి యిక్కడకు వచ్చితిమి.

భిక్షు—(ఆనందముతో)

క. రామా! రాఘవ! మేఘ
శ్యామా! రాక్షస విరామ! । జగ దభిరామా!
భీమాహవ విజయశ్రీ
ధామా! వందనము! సుభగ । తారక నామా!

గీ. దశరథాత్మజులార! వం । దనము మీకు!
ధన్యుఁడను భవద్దర్శనో । త్సవము కతన!
సూర్యసుతు సచివుఁడ మరు । త్సుతుఁడ మఱియు
నాంజనేయుఁడ హనుమంతుఁ । డనెడువాఁడ.

రామా! రవికుల రాజాభరణ! వాలిపంపున సుగ్రీవుఁ జంప వచ్చిన రిపు విభంజను లని భ్రమియించి కల రూ పెఱిఁగికొనుటకు నేనీభిక్షు వేషమునఁ జనుదెంచితి; దుష్టులను శిక్షించి శిష్టులనురక్షించుటకునవనీతలమున నవతరిల్లిన నారాయణుఁడవు గాని నరుఁడవుగావు; వాసవనందనుఁడయినవాలి మదన పరతంత్రుఁడయి తమ్ముఁడనితలఁపక దార నపహరించి పురమునుండి వెడలఁగొట్టఁ జేయునది లేక సూర్య

సుతుఁడు సుగ్రీవుఁడు ఋశ్యమూకముం జేరి యడలుచున్నాఁడు; ధర్మత్రాణ పరాయణులు దేవర వాసవిం దునిమి భాను నందనుఁ బరిగ్రహింతురేని యాతఁడును దేవరకు మిత్రపర్యాయాంతరితమయిన దాస్యముం జేయు.

రాము—ఓయీ! హనుమంత! తగవు మాలిన వాలి నిప్పుడ వధించి సుగ్రీవుని వానర నాయకత్వమునయం దభిషిక్తుం జేసెద!

హను—దేవా! అసాధ్య సత్త్వుఁ డప్పురందర పుత్త్రుఁడు; అతఁ డెత్తివైచిన దుందుభి కంకాళ కూట మిది శిలోచ్ఛ్రయము చాడ్పున యోజనము దూరము వచ్చి యిచ్చటఁ బడినది.

రాము—త్రోవ కడ్డము; (పాదాంగుష్ఠముతో మీటు)

హను—(తనలో) అబ్బా! సర్వాతిరిక్తబలుఁడు రాజసుతుఁడు. వాలి చేతులతో యోజనము విసరినది పాదాంగుష్ఠముతోఁ బది యోజనము లెగఁజిమ్మినాఁడు. నిస్సంశయము. వాలిం జంపఁ గలఁడు! (ప్రకాశము) దేవా! సమర శౌండుఁ డిది యెఱిఁగిన వాలి తా నిక్కడకు వచ్చు! నే నంతలో మా ఱేని దేవర చరణ సన్నిధికిం గొనివచ్చెద! (నిష్క్రమించు.)

రాము—శంకూద్ధరణము మన కిమ్మహా బాహునివలనఁ గావలయు!

లక్ష్మ—బ్రహ్మశాపమునం జేసి యిమ్మహాబల నందనుఁడు తన బలము తా నెఱుఁగక పరవీరుల ననుసరించుచున్నాఁడు.

రాము—అవును! అదియునుంగాక యితఁడు భగవానుఁడయిన సహస్రభానునితో వ్యాకరణము జదివి తత్తనయునకు సుగ్రీవునకు సాహాయకము గురుదక్షిణ గావించె.

లక్ష్మ—ఆర్యా! యింద్రనందను వధించి సుగ్రీవునిఁ బొందు నభిలషించుటకంటె సమగ్ర శక్తి సంపన్నమయిన వాలి సాహాయ్యమే సర్వవిధముల మనకుఁ దగినది యని తోఁచెడిని.



రాము—బలగర్వితుఁ డయ్యింద్రనందనుఁ డన్యుల ననుసరింపఁడు! మన సాయ మపేక్షించినవాఁడు గావున సుగ్రీవుఁ డితఁడు మనకు వశవర్తియై మెలఁగు!

(సుగ్రీవుఁడు ప్రవేశించును)

సుగ్రీ—రామా! రవికులాభరణ! రవిసుతుఁడు సుగ్రీవుఁడు మ్రొక్కుచున్నాఁడు.

రాము—సఖా! సుగ్రీవ! సహామాత్యునకు నీకు స్వస్తి! రావణుని జాడ యేమయినఁ దెలియునా?

సుగ్రీ—దేవా! రాక్షసుఁ డొకఁ డంబరవీథిం జెఱగొనిపోవునపుడు "రామ రామా!" యని యాక్రందించుచు నొక రామ క్రిందఁ బడవైచిన మూట యిది తిలకింపుఁడు!

(మూట నొసఁగును)

రాము—(గ్రహించి) అదే యిది!

సీ. కష్ట కాంతార మా । ర్గప్రయాణములందు
వ్యజనంబు స్వేదాప । హరణమునకు
సానుమత్ప్రాంత సం । చార వేళలయందు
నుష్ణవారణ మాత । పోపహతికి
సరస కేళీ కళా । చాకచక్యములందు
జయ పతాక ప్రసూన । సాయకునకు
భామా జనోచిత । ప్రణయ కోపములందుఁ
బ్రతిసీర ముఖ హేమ । పద్మమునకుఁ
బ్రేయసీ కుచ కుంభ గం । భీర మధుర
నవ్య రేఖాంకిత కురంగ । నాభి గంధ
భుగభు గాత్రమేడి తాపార । భోగ సంప
దంచితంబు శ్రీ పైతాప । టాంచలంబు.

(విప్పి) వత్సా! యివి చూడుము!

లక్ష్మ—(చూచి) అన్నా!

ఉ. హార మెఱుంగ నే నది గ | ళాభరణంబు మణిప్రకాండ కే
యూరము లే నెఱుంగ నవి | యుష్మ భుజ భూషలు ప్రత్యహంబు సు
శ్రీరమణీయ పాద సర | సీరుహ వందన వేళలందు మం
జీరము లే నెఱుంగుదు భ | జింతు భవత్సతివంచు భక్తితో.

రాము—హా! ప్రేయసీ! జానకి!

సీ. ఆమ్నాయ వాణి నా | నతివిశుద్ధంబైన
సవన మేదినియందు | జనన మొంది
చతురానన నిభుండు | జనక భూభుజుని హ
స్తాంభోరుహంబున | యందుఁ బెరిగి
శాంభవం బది శరా | సనము పణంబుగాఁ
గృతహస్తు నొక్కనిఁ | గేలువట్టి
సంగరంబునఁ దురా | షాడభిష్టుతులైన
యిక్ష్వాకు వంశ్యుల | యిల్లు సొచ్చి
గీ. శ్రీ భృగూద్వహునకు మీఁది | చేయి మఱఁది
లక్ష్మణుఁడు సేతు లొగ్గి నీ | లగ్గు లరయ
ధర్మ రతవై విరాజిల్లు | దాని నిన్ను
దానవుల పాలు సేసెనా | దైవ మకట!

లక్ష్మ—(తనలో) ఈరస పిధానమునకు మఱియొకఁ డేది యగునో!

(తెరలో) ఓ వనౌకసులారా! అస్మత్కీర్తి కామినీ కేళీ శైల కూట మీ దుందుభీ కంకాళ కూటముం గదిపిన వా రెవరు? చిర కాలమునుండి పేరిన నా భుజదండముల దురద వాపికొనియెద!

రాము—ఘన నిర్ఘోష గంభీర మది నిస్వన మెవ్వనిది?

సుగ్రీ—(వైక్లబ్యముతో) దేవా! అదిగో నతఁడే వాలి!



లక్ష్మ—భయపడకుఁడు!

హను—రామ సన్నిధాన మభయ దుర్గము.

వాలి—(వచ్చి- చూచి- తనలో) ప్రసన్న గంభీరాకృతులుగల వీ రెవరు? (ప్రకాశము) ఎవ రా సన్నివిష్టులు? ఈ కంకాళ కూటముం గదిపిన మొక్కలీని నిప్పుడ గీటడఁచెద!

లక్ష్మ—ఓరీ! వానరాధమ! నిన్ను గుఱిసేయుటకు మాకు సిగ్గగుచున్నది.

వాలి—ఆః! ఎవరు మీరు?

లక్ష్మ—రాఘవులము.

వాలి—క్షత్రియు లని రూపమే చాటుచున్నది; విశేషము నే నడిగినది.

లక్ష్మ—ఆ విశేషమే నేఁ జెప్పినది రాఘవుల మని.

వాలి—అపత్యప్రత్యయాగత మది గాదు నే నడిగినది; సాంస్కారిక నామము.

లక్ష్మ—ఆ రామ లక్ష్మణులము.

వాలి—(తనలో) ఏమి వీని గర్వాతిరేకము? సర్వనామము తగిల్చి కొనుచున్నాఁడు. (స్మరణ మభినయించి తనలో) "రాముఁ డను రాజన్య సుతుఁడు తమ్మునితో దండక సొత్తెంచి తత్రత్యుల దనుజులఁ గెడపుచున్నాఁడు; మా ప్రియ సుహృదుఁడు వానిం జిదుముత" మని దశాననుఁడు మాకు జాబు వ్రాసినాఁడు. (ప్రకాశము) అవును! వినుచున్నాము! ధనురాది పరికరములు రూప రేఖాది విలాసములు సర్వము నొక చే తీరు! మీలో రాముఁ డెవరు? లక్ష్మణుఁ డెవరు?

లక్ష్మ—నేను లక్ష్మణుఁడను.

వాలి—అతఁడా తాటకా దమనుఁడు? కనిష్ఠ కాకుత్స్థ నీవు నిలుము! పినాకమును విఱిచిన నీ యన్న భుజబలము పరీక్షించెద!

రాము—మహాభాగ! సమర శౌండ చూడామణివి! నీ పాలించు కిష్కింధయందుఁగద రావణాభిభవక్లాంతయయిన భూకాంతకు నుచ్ఛ్వాసము!

వాలి—మారీచ మథన! మాటలతో మాకుఁ బని లేదు.

రాము—ఇదిగో నా విల్లు సజ్యమై యున్నది.

వాలి—తల ముష్టి నఖాయుధులకు మాకు విల్లక్కరలేదు.

రాము—ఏమి దైవ మాయ!

సీ. నినుఁ గన్న వాఁడు ని । ర్ణిద్ర తేజుఁడు పాక
శాసనుఁ డనిమిష । చక్రవర్తి
నీకు లోఁగినవాఁడు । నిఖిలలోక విజేత
రాక్షసాధ్యక్షుండు । రావణుండు
నీ తీర్థ మాడు పె । న్నీటి ధారలు మేఖ
లా కలాప మిలా వి । లాస వతికి
నీ యేలు రాజధా । నికి నగంబులువోని
సాలములరి కీక । స నివహములు
గీ. వానయలు వశవర్తు ల । వార్య బలులు
మఱియు నిర్వృతిముఁడవు దో । ష్మంతులందు
నట్టిఁడవు నీవు నిటు లక్ష్య । మయితి విపుడు
కాలవశమున నా ధను । ష్కాండమునకు.

వాలి—ఆః! ఐక్ష్వాక!

శా. త్రైలోక్యప్రథమాన బాహుబలు దై । త్యగ్రామణిన్ నొంచియున్
నాల్గో నేన వహింప మోదము నప । ర్ణా నాథు నర్చించి దో



శ్శైలిం గొంచెముఁ గాంచెవాఁడు; భృగువం । శజ్యోతికిన్ మీఁద నా
సాలప్రాంశు నినున్ జయించి పిదపన్ । సమ్మోదముం జెందెదన్.

సమరోచితప్రదేశమునకుఁ బోవుదము రమ్ము!

(ఇరువురును నిష్క్రమింతురు.)

(తెరలో) హా! నాథా! నాథ! నీ పెకలించి రువ్విన సాలము లేశింటిం జెండి రాఘవాస్త్రము నీ యురమ్మును వ్రచ్చెనా?

సుగ్రీ—హా! కష్టము! కష్టము! గుహాంతఃపురమునుండి యీవలకు వచ్చి తార విలపించుచున్నది. అయ్యో! మా త్రిభువన వీర మౌళి మాణిక్య మంతలో బొగ్గయి పోయెనా!

హను—చుట్టఱికముఁ జూచిన వీరైక భోజ్యము రాజ్య మెట్టులు?

సుగ్రీ—పగఱకయినను బంధు మరణములు పరితాప కారణములు! అయ్యో! నే నెంత కూళను!

లక్ష్మ—కడచినదానికి వగచిన నేమగు?

సుగ్రీ—సౌమిత్రీ! యేముం జని రామచంద్ర చరణారవిందములకుం బ్రణమిల్లి దుఃఖితులగు బందుగుల నూఱడించెదము.

(నిష్క్రమించు.)

(తెరలో)

శా. కక్ష్యాగర్త కఠోర సంకట దశా । కష్టాభిఘాత స్ఫుట
ద్రక్షోరాజ శిరఃకిరీట నికష । గ్రావంబు తారా వధూ
వక్షోజ ద్విరదంబు నైన కపిరా । డ్వక్షంబు భేదించు శ్రీ
దక్షంబైన రఘూద్వహాస్త్రము దయా । ర్ద్రంబై మముం బ్రోవుతన్.

లక్ష్మ—విజయ లక్ష్మి విలసితుఁ డార్యుఁ డరుదెంచుచున్నాఁడు.

రాము—(ప్రవేశించి) వత్సా! లక్ష్మణ! వానరచక్రమునకు సుగ్రీవుఁ డధిరాజు; వాసవ పౌత్రుఁ డంగదుఁడు యువరాజు

లక్ష్మ—పుత్ర వధ దుఃఖితుఁడయ్యును బురందరుఁడు పౌత్ర యౌవ
రాజ్యాభిషేకమున సంతుష్టుం డగు!

(తెరలో) గోలాంగూల భల్లూక ప్రముఖ యూథ పతులారా! నూతన విభుఁ డయిన సుగ్రీవు నాజ్ఞ యిది వినుఁడు!

మ. హనుమానుం డదె యేగువాఁడు మఱి సీ | తాన్వేషణార్థంబు వా
రినిధిం దాఁటి! తదీయ వార్తఁ గొని పేర్మిన్ వచ్చు నాలోనమీ
రున్న మీ వర్గ్యుల సర్వ పర్వత వన | క్రోడాంతరావాసులం
బనిమైఁ బన్నుఁడు వైరి రత్న మకుట | ప్రక్షేప ణోత్సాహులై.

రాము—ప్రియము! ప్రియము! వత్సా! లక్ష్మణ! ప్లవంగ పుంగవుని
వలన వైదేహీవార్త తెలియుదనుక మన మీ ప్రస్రవణా
చలముపై నధివసింతము రమ్మ!

(నిష్క్రమింతురు.)

ఇది
శ్రీ బ్రహ్మానంద విరచితము జగదానందము
చతుర్థాఙ్కము.





శ్రీరస్తు

బ్రహ్మానందీయము.

# జగదానందము

## పఞ్చమాఙ్కము

(రాక్షసీ పరివృత సీత ప్రవేశించును.)

సీ. హా! రామ! రామ! హా! | హా! యెంత దొసఁగయ్యె!
నా పురాకృత మెంత | పాప మయ్యె!
బంధు వత్సల కులా | భరణ! లక్ష్మణ! నీకు
నా వార్తఁ దెలుపు మే | ధావి యెవఁడు?
నూపురంబేని నా | నుడి వచింపదొ మీకు!
మూకీకృతంబయ్యె | నో కరంబు!
విధి విధానం బెంత | విపరీత మక్కటా!
ప్రారబ్ధ మడఁప నె | వ్వారి తరము?
గీ. విశ్వ వలయైక వీరుఁడౌ | విభునిఁ గేలు
వట్టియుం దుదకిటు చేటు | వడి దయా ర
సంబెఱుంగని కఠిన రా | క్షసుల నడుమఁ
గటకటా! యెంతకాలము | గ్రాఁగుదాన!

రాకాసులలో నీ యేకజట కడు బెట్టిదురాలై య[illegible]ులు వేఁచుచున్నది.

ఏకజట—ఓసీ! సీతా! రాతిబొమ్మవోలె మాటాడ వెక్కడ నేర్చితి
వీ ప్రాణాయామము? చూడమి నిటు బిఱుసెక్కితివి గాని
మా రావణప్రభు శుద్ధాంత సుషమ సుంతఁ జూచిన వైశిక
మునకు నీవే మెత్తఁబడెదవు! చెప్పెదఁ జెవియొగ్గి వినుము!

సీ. కందువోఁ దుడిచి రా । కా చంద్ర కళలతో
సంతరించినయవి । చామరములు
షాణ్మాతుర మయూర । చంద్రకాంకములతో
వెలయించినవి హేమ । విష్టరములు
నాగాధిపాననా । ననదంత దళముతోఁ
గావించినవి రత్న । కంకతికలు
వాసుకిప్రముఖాహి । వర ఫణా మణులతోఁ
గూర్చినవి ప్రదీప । కోరకములు
గీ. సంజకెంజాయ కుంకమ । సంగ్రహంబు
ద్వాదశాత్మ ఘంటాయంత్రి । దర్పణంబు
సరస సైరంధ్రు లప్సర । శ్చంద్రిముఖులు
శాఖశాయనికులు సుర । స్వామి సతులు.

కావున మా మహారాజుం జెట్టవట్టుము! నామాట నమ్మిక చాలకున్న నిది యీ త్రిజటంగూడ నడుగుము!

త్రిజట—ఓసీ యేకజట! సీతకు సుదినములు రానున్నవి; అట్టికల నే
నొకటి గంటి.

ఏక—ఎట్టి కల?

త్రిజట—సౌమిత్రి సహితుఁ డయిన రాముఁడు చందన గంధానులేప
నుఁడై శ్వేతమాల్యాంబర ధారిణియైన సీతతో సూర్యసన్నిభ
మైన విమానము నారోహించి యుత్తరాభిముఖుఁడై వెడలె;
మఱియు వరాహముతో రావణుఁడును, ఉష్ట్రముతోఁ గుంభ



కర్ణుఁడును శింశుమారముతో మేఘనాదుఁడును గృష్ణాంబర
ధరులై నెత్తురుద్రావుచు యామ్యదిశకుం జనిరి; విభీషణుఁడు
దక్కఁ దక్కిన నిశాచరు లెల్లరు తైలాప్లుతులైరి.

ఏక—చాలుఁజాలు! నీ కలలుం బలవరింతలునా మాకు శకునములు
ఇక్కడి కబు రక్కడఁ దెలిసినఁ గద మీఁది ముచ్చట!

త్రిజ—విధి విధానమున కది యెంతపని?

(తెరలో) అదిగో మర్కట మొకఁడు పురప్రాకారము లంఘించి వచ్చెడిఁ గాచికొనుఁడు!

(అందఱును భయ మభినయింతురు.)

(వెండియుఁ దెరలో) భయపడకుఁడు! ప్రభుకుమారుఁ డక్షుఁ డధిజ్య శరాసనుఁడై యెదురుచున్నాఁడు.

ఏక—ఓసీ! త్రిజట! అదేమో మొదటనుండియు నీవు ప్రభుపక్షము
వీడి విపక్షపక్షము నవలంబించు చున్నావు. మహారాజుతోఁ
జెప్పెదఁ జూడు నీ సంగతి!

త్రిజ—ఇది మఱీ బాగున్నది; నడుమ నాకా మంత్రసానిగండము?

ఏక—ఓసీ। సీతా! యేమనియెదవు?

సీత—ఓసి నిశాచరి!

సీ. ఐరావతముతోడ । నలరు విద్యుల్లేఖ
యాశించునే వరా । హంబు చెలిమి?
స్వర్గాపగా శుభ్ర । సైకతంబునఁ గేగు
హంసి గోరునె పల్వ । లాశ్రయంబు?
సహకారమునయందు । సాఁగు షట్పద మాల
క్రమ్మఱునే మఱి । గ్రచ్చపొదకు?
విధు బింబమునయందు । వెలయు వెన్నెల జాలు
కన్ను విచ్చునె తమో । గ్రహమువంక?

గీ. జిత్రకిరణుని వీక్షించి । చెలఁగు నళిని
జ్యోతిరింగణముం జూడ । నుల్లసిలునె?
సావనానల శిఖ వంటి । సతి పథమ్ముఁ
జాఱి తిరుగునె నీచప్ర । చారమునకు?

ఏక—(కహకహతో) ఎట్టెట్టూ? నీ మగఁ డట్టిఁడా? అవుఁగాక!
నడుమనున్న యియ్యర్ణవ మెట్లు దాఁటి రాఁగలఁడు?

సీత—వారి చేవ నీకేమి తెలియు?

ఉ. అర్ణవ మొంటు గా దిది మ । హా విలయోర్మటి నుబ్బి ప్రబ్బి స
ప్తార్ణవి వచ్చినం బ్రకుపి । తాతి భయంకర రాఘు వాశుగో
దీర్ణ తనూనపాచ్ఛిఖలఁ । గీడ్వడి వేగ చటచ్చట ధ్వనిం
జూర్ణమగున్ నిజంబు! సుర । శూరులు నోడుదు రొడ్డి నిల్వఁగన్!

మఱియు

శా. ద్యావాభూములు గర్భముల్ వగులఁగ । ల్పాంతాబ్ధిముల్ నాథను
ర్జ్యావిస్ఫూర్జిత ఘోష భీషణ శరా । సారంబుతోఁ బర్వియు
గ్రావష్టంభులు రామలక్ష్మణులు తీ । వ్రారంభులై చెండుచోఁ
గావంజాలరు బ్రహ్మరుద్రులును మీ । క్రవ్యాద ధౌరేయులన్.

ఏక—అందు కిదే నీ నిశ్చయము!

సీత—ముమ్మాటికి!

ఏక—చచ్చెదు సుమీ!

సీత—కానిమ్ము!

ఏక—(చేయి సాఁచి) ఏదీ చషకము? కుత్తుకఁ గోసి దీని నెత్తురు ద్రావెద. (చేయి దీసికొని) ఇదిగోఁ బానపాత్రము! (చూచి) కటకటా! పాత్ర గా దిది! అక్ష కుమారుని కపాలము! ఎవని దీ దుష్టచేష్టితము? (ఆలోచించి) ఆ క్రోఁతిది గావలయు! తొలుత నిది మహారాజుతో మనవిసేసి పిదప దీనిపనిఁ బట్టెద

(నిష్క్రమించు.)



త్రిజ—చెలీ! నీ పున్నెమున నిపుడీ గండము గడచినది.

సీత—పాపమున-

త్రిజ—అట్లనకుము! బ్రతికియుండిన భద్రము లెపు డేనిఁ బడయనగు.

సీత—(నిట్టూర్చి) ఈ బొంది కింకనుభద్ర మెక్కడిది? ఎటు తరింతు విపన్మకరాలయము? గళ ముత్తరించుకొనుటకుఁ గత్తి లేదు; నీకుఁ బున్నెముండును జెలీ! సుంత నిప్పు తెచ్చిపెట్టుము! చొక్కాకులివి సొద పేర్చుకొనియెద.

త్రిజ—ఇది నిప్పుండు చోటు గాదు; చందన రస శీతలమైన భర్తృ వక్షఃపీఠమునఁ బరమానందముం బడయుదువుగాక!

సీత—పోనీ! ఇయ్యశోకము నడిగెదను. (చేయి సాఁచి)

గీ. విరహులకు దుర్భరాంగార । వృష్టిఁ గురియుఁ
గిసలయములు తావకములు । దయ వహించి
సుంత యిడు మగ్ని కణము న । శోక కుజమ!
జనకజకు మనస్తాపప్ర । శాంతికొఱకు.

(ఆనందముతో) అశోకము నా కగ్నికణ మిచ్చినది.

త్రిజ—ఏదేది? నిజముగానే?

సీత—(విషాదముతో) చల్లగ నున్నది.

త్రిజ—శీలవతుల కగ్నియు శీతలమగు!

సీత—(చూచి) అంగారము గా దిది బంగారము.

త్రిజ—భాగ్యవంతులు పట్టినది యెల్ల బంగారమే.

సీత—నా నాథుని ముద్దుటుంగరము. (కనుల నద్దుకొని) కుశలమా సలక్ష్మణములయిన రామ చరణారవిందములకు?

హనుమంతుఁడు—(ప్రవేశించి) కుశలము! కుశలము!

సీత—అన్నా! అమృతాననుఁడవు నీ వెవరు!

హను___రామదూతను, సుగ్రీవానుచరుఁడను, మరుత్సుతుఁడ నాంజ
నేయుఁడను. అక్షుం జంపి వాని కర్పరముతో నేకజట వవ
లకుఁ బంపి దేవీహస్తమున శ్రీరామాంగుళీయకము నిడిన
చరణదాసుఁడను హనుమంతుఁడను.

సీత___సుగ్రీవుఁ డెవరు?

హను___రామచరణానువర్తి కపిచక్రవర్తి.

సీత___నరవానరులకు స్నేహముఁ గావించిన వా రెవరు?

హను___రణమున వానరేంద్రుఁడయిన వాలిం జంపి దారతో సుగ్రీవు
నకు రాజ్య మిచ్చిన రాఘవాశుగము.

సీత___(తనలో) ఇదియును మాయ గాదుగద!

హను___అమ్మా! సందేహపడకుము! రావణుఁడు గొని వచ్చునపు
డీవు క్రిందఁబడవైచిన భూషణముల మూటను ఋశ్యమూకము
నుండి యెగిరి పట్టుకొన్నవాఁడను నేను. సుగ్రీవుఁ డది రాఘ
వుల కుపాయనమిచ్చి కృతకృత్యుఁడయ్యె. మఱియు వారి
విశేషము లిట్టివి___

సీ. ఆర్ద్రాంబుదముభాతి । నలరు దేహమువాఁడు
సంభృత విపుల వ । క్షంబువాఁడు
ఆజాను దీర్ఘంబు । లయిన బాహులవాఁడు
తరుణాబ్జ పత్ర నే । త్రములవాఁడు
సంపూర్ణ శశి బింబ । సదృశాననమువాఁడు
కరుణా కటాక్ష వీ । క్షణమువాఁడు
ఛద్మ మింతయు లేని । సత్యవాక్కులవాఁడు
కంబూపమితమైన । గళమువాఁడు

గీ. కరటి గతివాఁడు శక్ర వి । క్రమమువాఁడు
ప్రశమ సువిభూషణమువాఁడు । రామ విభుఁడు



విమల గుణములఁ దమ్ముఁ డ । ద్విధమువాఁడు
చండసత్వుఁడు కాంచన । చ్ఛాయవాఁడు.

సీత___ఈ మందభాగ్యనిమిత్త మార్యపుత్రుఁ డిప్పు డతిమాత్రముఁ
గృశించియుండు!

హను___అవును!

గీ. అల సితేతర పక్షామృ । తాంశునట్లు
ప్రత్యహముఁ జిక్కుచున్నాఁడు । భాను కులుఁడు
వృత్రరిపు నీల రత్న వి । ద్వేషియైన
రుచి విజృంభించు మఱి విని । రూఢమగుచు.

మఱియు

సీ. శంకావిలుండగుం । జందనాచల జాత
మారుత మురగ ఫూ । త్కార మనుచు
రేలు నీడల కోస । రిలు నిండు వెన్నెల
మండు వేసంగి క । ట్టెండ యనుచు
దుందుడు కొందు వి । ద్యుత్వంత మగు నవాం
భోవాహ మది మహా । దావ మనుచు
సంక్షోభపడు భృంగ । సంఘ సంకుల కోవి
దార మపూర్వా కు । ఠార మనుచుఁ

గీ. గందు హిమ బిందువులు వహ్ని । కణము లనుచుఁ
గుందుఁ గుంద మయ్యది పాణి । గొడ్డ మనుచు
సర్వవేళల నిమ్మాడ్కిఁ । జంద. మెడలి
పొగయుచున్నాఁడు రఘుకుల । భూషణుండు.

త్రిజ___సఖి! నీవును రఘువిభున కేదేని ప్రత్యభిజ్ఞాన మొసఁగుము.

సీత___(చూడామణి నిడి) అన్నా! ఆంజనేయ!

సీ. అక్షపాదునకుఁ గ । న్యా దాతలగు రఘూ
ద్వహ పాదములకు వం । దనము లనుము!
కఠిన రాక్షస గళ । గ్రంథి లుంటాక మా
సౌమిత్రి వింటికి । సనుయ మనుము!
నీటఁ బాసిన పద్మి । నియుఁ బోలె నుడుకుచు
నొంటి ప్రాణంబుతో । నుంటి ననుము!
తమ రాకఁ జూచుచుఁ । దాళుదు నిఁక నొక
నెల ప్రాణ మామీఁద । నిలువ దనుము!
గీ. రమణులకు నెందు గృహిణులు । రక్ష్య లనుము!
దుష్టచిత్తులు విష్టప । ద్రోహులు నగు
రాక్షసులఁ జంపు రణ కేళి । రాఘవులకు
నగ్గుతో పాటు బాల్య ని । ర్వ్యథ మనుము!

హను—అమ్మా! అందనుక నెందులకు? నీ హృదయేశ్వరుఁ డిట్లు సెప్పు మనియె.

'మగువ! నీ యున్న నెల వది । మాకుఁ దెలియు
క్షణము సౌమిత్రి చాప టం । కారములును
వైరి శుద్ధాంత బాష్పప్ర । వాహములును
వెండియును నీకు మా రాక । వెల్లడించు."

(తెరలో) అరే! అక్షుం జంపిన కోతీ! నిలు! నిలు! పాఱిపోకు! మా దశానన మహారాజు నానతి నిన్నుచ్చువోసి కొనిపోవుటకు—

గీ. భండనంబున నింద్రాణి । పైఁట చెఱఁగు
ధ్వజ పటముఁ జేసికొన్న ప్ర । తాపమూర్తి
మేఘనాదుఁడు వచ్చె న । నీకమునకు
సంభృతాస్త్రుఁడు ముఖరోరు । చాపుఁడగుచు.



హను—(ఉత్సాహముతో)

చ. కలన నొకండ వేల్పుల న । ఖండుల ముప్పదిమూఁడుకోటులం
గలఁచి పురందరుం గమిచి । కాలును గేలును గట్టి బందిగా
వలసకుఁ గొంచుఁ జన్న । బలవంతునితో నల దాశకంఠితోఁ
దలఁపఁగఁ గయ్యమైన నతి । ధన్యుఁడ నాజ్ఞ యొసంగు మమ్మరో!

సీత—శర నిగమ పారీణుఁ డప్పురుహూత వైరి. అయినను శ్రీరామ చరణ సరసీరుహ సంస్మరణ వశంబునను, నీ తండ్రి వాయుదేవుని జవసత్త్వముల కతంబునను మకరాలయముంబలె నిమ్మేఘనాదు నుల్లంఘించి వెడలుదువుగాక!

హను—మహాప్రసాదము దేవీ వాక్యము! (నిష్క్రమించు.)

త్రిజ—సఖీ! ఖేచరినై యేను సర్వము నీకు వినిచెద!

(నిష్క్రమించు.)

(తెరలో)

సీ. విశిఖ ధారా వృష్టి । విలయాంబుదములీల
వర్షించుచున్నాఁడు । వాసవారి

సీత—సాటిలేని సాంయుగీనుఁ డవ్వేల్పుసూడు.

(తెరలో)

ప్రళయ కాలానల । ప్రతిమానుఁడై దానిఁ
గబళించుచున్నాఁడు । కపివరుండు

సీత—హనుమయు నపార బలుఁడు.

(తెరలో)

ద్రుహిణాస్త్రమున మూర్ఛ । తుఁడు గాఁగ దీప్త పు
చ్ఛుఁ జేసెఁ బృషదశ్వ । సుతు సురారి

సీత—అనలదేవ! తండ్రితోడి సఖ్యముం దలంచి మా మారుతిపైఁ గృపఁ జూపుము!

(తెరలో)

తా నంతలోఁ బ్రబో । ధము నొంది కుప్పించి
యెగసి పీ డెల్ల ద । హించె హనుమ

సీత—రాక్షసులకుఁ దగిన శిక్ష జరిగినది.

(తెరలో)

గీ. యెగసి దహియించుచేఁ గా ద । హీన బలుఁడు
పాటవంబున గంధర్వ । పథము డిగ్గి
వారినిధి వీచికల నిజ । వాల లగ్న
హవ్యవహ పుంజ మల్లఁ జ । ల్లార్చుకొనియె.

సీత—ఇప్పటికి ముప్పు గడచినది.

(తెరలో)

గీ. క్రుంగి కుధియ సువేలాద్రి । కూట మెక్కి
వేగ జాతానిలోద్ధూత । వీత సలిల
గర్భముననుండి శేషాహి । కని నుతింప
హనుమ లంఘించె ద్యుమణి నా । నంబురాశి.

సీత—(తెరవంకఁ జూచి) చెలీ! త్రిజట! గగనమునుండి డిగిన ప్రియంవదను నిన్ను నే నిదె వచ్చి కౌఁగిలించుకొనియెద.

(నిష్క్రమించు.)

ఇది
శ్రీ బ్రహ్మానంద విరచితము జగదానందము
పఞ్చమాఙ్కము

---



శ్రీరస్తు.

బ్రహ్మానందీయము

# జగదానందము

## షష్ఠాఙ్కము

(లోహపాదుఁడు ప్రవేశించు)

లోహ—ఇనుప గుదియలు గావున నా కాళ్లిట్టులున్నవి. రాజకీయ వ్యాపార యాతాయాతములకుఁ జర్మచరణములయిన నీపాటికిఁ జినిఁగి చిల్లులుపడి తుక్కుతుక్కగును! దానికేమి? కొల్వు గొల్చుటలో సర్వసాధారణముగా నున్న కష్టమే యిది; కాని మేము మున్నెన్నఁడు నెఱుంగని మహాభోగముల నిప్పుడు దశానన మహారాజు కతంబునం బడసితిమి. అప్సరస్త్రీ సల్లాపములు, ఐరావణ గజారోహణములు, కల్పవృక్ష ప్రసూన గ్రైవేయకములు; ఒకఁడననేల? స్వర్లోక సౌఖ్యము సర్వము మాయది. మా మహారాజున కొక్కనికి నియోజ్యులము గాని తక్కిన త్రిభువనావాసుల కందఱకును మేము మహేంద్రులము. ఇటమీఁద మా భాగ్య మెట్లున్నదో! దైవసంకల్ప మెవ్వరికిం దెలియదు.

మ. స్ఫుర సంతాన విధూననుండు రణ ద । క్షుండుగ్ర చక్రక్షతా
భరణుం డుద్ధృత శంభుశైలుఁ డినుఁడై । పౌలస్త్యుఁ డున్నట్టి యీ

ఘురముం గోఁతియొకండుసొచ్చి యనిదం । పూర్వంబుచిత్రంబుగాఁ
గరమున్ ధూమమయంబుఁ జేసిచనియెన్ । గర్వాతిదుర్వారమై.

(ముక్కున వ్రేలుంచుకొని) అన్నన్నా! యేమి యీ కోనమనికి దుండగము! అది గన్నది మొదలేమి సేయుటకును వెరవు దోఁపక మహామాత్యుఁడయిన మాల్యవంతుఁడునుం దటతట గుండియ లదరుచున్నవాఁడు. (చూచి) కయ్యము సేతకుఁ గోఁతి మూఁకలతో రాముఁ డెత్తివచ్చి సువేలాచలమున విడిసి యుండె నని విని "శిబిరచ్ఛిద్రము లరసి రమ్మ"ని మంత్రి మాల్యవంతుఁడు పనిచిన జంబుకుఁడు వీఁడు.

(జంబుకుఁడు ప్రవేశించు)

జంబు—సురాసురాయోధనములు కోటానఁగోటులు చూచిన నాకును వానర చమూ విలోకనమువలనం బొడమిన వణఁకింకను వదలకున్నది. (చూచి) ఓహో! లోహపాదుఁడు.

లోహ—జంబుకుఁడా? యిదే కాఁబోలు రాక! కపి శిబిర విశేషములు?

జంబు—నేల యీనినట్టు లున్నది కపిసేన. వానికి వాఁడే ప్రతివానరుఁడును లంకారాష్ట్రము సర్వము రాక్షస వ్యూహముతో నేను మ్రింగుదును నేను మ్రింగుదును నేనే నేనే యని కడుపు నిమురుకొనుచున్నాఁడు. అది యటుండ దేవర చినతమ్ముఁడు విభీషణుఁ డిందుండి యిప్పు డందులకు వెడలి వచ్చిన హేతువేమి?

లోహ—"పరవధూ ఫాలపట్టిక చతుర్థీ చంద్రరేఖవంటి"దని సవినయముగ నన్నకు విన్నవించె.

జంబు—పిమ్మట?

లోహ—భీరు భాషిత మని ఱేఁడది పెడచెవిం బెట్టె.



జంబు—పిదప?

లోహ—"వాలిం దలంచుకొని వానరులను గాత్రవీర్యుని స్మరించి నరులను జులక సేయకు"మనియె.

జంబు—సుళువుగా నొవ్వనాడినాఁడు. తరువాత?

లోహ—ప్రభు చరణ తాడితుఁడై యందులకుం బఱతెంచె. ఏమయిన దక్కడ వానిపని?

జంబు—వానరు లెల్లరు "వచ్చినవాఁడు పగవాని తమ్ముఁడు! పట్టుఁడు! కట్టుఁడు! కొట్టుఁ"డనిరి.

లోహ—రాముఁడు—?

జంబు—

క. అణుమాత్ర మేనిఁ గొంకక
గుణగృహ్యుఁడు రాముఁ డరసి । గురుమతి నంఘ్రి
ప్రణతుండగు వాని విభీ
షణు నభిషేకించె రాక్ష । స విభుతయందున్.

లోహ—ఎంతటి ధైర్యము!

జంబు—ప్రభువ్యాపృతి యెటున్నది?

(తెరలో)

సీ. చందనముం దెండు । చైత్రపాత్రమున నా
రామానిలంబుల । రంగరించి!
సంధింపుఁడు చకోర । చంచూపుట విలూన
శశి కరాగ్రములతోఁ । జామరములు!
గ్రుచ్చి పంపుఁడు బిసాం । కురసూత్రములతో హి
మాంబు కణంబుల । హార లతలు!
సంతరింపుఁడు పరి । చ్ఛదము వెన్నెలలోని
ధవళిమతోఁ బువ్వు । తల్పమునకు!

గీ. గగన కూటమునుండి చు । క్కలను దులిపి
తోయదోల్లాభమునయందుఁ । దుఱుముఁడు మఱి
యమృత వారాశి కడుపున । నవతరిలిన
జలజ పాణులఁ బిలుఁ డుప । చారమునకు!

లోహ—అదిగో! అనంగ దశా పరవశమై యటున్నది.

జంబు—పరిపంథి వచ్చి పయిఁబడినప్పు డిప్పుడు నదే వ్యామోహామా?

లోహ—మనదేమి పోవును? ప్రధన భటులము గాము గద! మన తలలు మనకు మిగులును. పాలనకుఁ బరగణా లుండవు గాని యూడిగమున కూల్లుండును! "రాజ దర్శనమునకుం జను ప్రహస్తుని చేతి కిచ్చి రమ్మ"ని మంత్రిమాల్యవంతుఁ డిచ్చిన చిత్రపట మిచ్చి వచ్చెదను.

జంబు—ఏనుం జని నా చూచినది మంత్రికి వినిచెద.

(నిష్క్రమింతురు.)

[చిత్రపట హస్తుఁ డయిన ప్రహస్తునితో రావణుఁడు ప్రవేశించు.]

రావ—అమ్మణిగర్భా కుమారి పంచేషుప్రణయినీ ప్రాసాద పాంచాలికయుంబోలెహృదయగ్రాహిణి. ఆరాచముద్దియ సౌష్ఠవమట్టిది.

శా. మాణిక్య ప్రతిపాదితంబయ్యిన ని । ర్మాణాతిరేకంబు, స
ప్రాణంబైన మెఱుంగు, సౌరభ గర్భీ । రంబైన బంగార, మ
క్షీణంబైన కలా కలాప, మతి రా । శీభూత లావణ్య, మా
క్షోణీసంభవ రూప వైభవము ని । ష్కాశాసి పంచాసికిన్.

ప్రహ—దేవా! చిత్రపట మిది తిలకింపుఁడు!

రావ—(చూచి) కడలి నడుమ నడ్డముగా నిది యేమి?

ప్రహ—సేతుబంధము.

రావ—కుశలుఁడవును జిత్రకారుఁడు! లేనిది యున్నట్లు చిత్రించినాఁడు.

ప్రహ—(తనలో) అబద్ధమనియే దేవర తలంపు.



రావ—సురధనుస్సహస్రానుకారి సువేలాచలముపై నెగయు నియ్యది?

ప్రహ—వానర చమూ చక్ర మది సుగ్రీవ పాలితము.

రావ—జడదారులు వీరెవరు?

ప్రహ—వారే రామ లక్ష్మణులు.

రావ—వినయముతోఁ జేతులు జోడించుకొని నిలువఁబడిన వీఁడు?

ప్రహ—నామగ్రహణమేల? బంధువిరోధి.

రావ—విభీషణుఁడా? ఉత్తపిఱికి; చేవదేఱి బలిసి నునుపెక్కిన వీఁ డెవఁడు?

ప్రహ—యౌవరాజ్య సుఖోపభోగ లాలితుఁడు వాలినందనుఁ డంగదుఁడు.

(అంగదుఁడు ప్రవేశించు.)

అంగ—అవు నంగదుఁడు వీఁడు!

రావ—ఎవరు రానిచ్చిరి నిన్ను?

అంగ—ఒకరు రానీయనేల? నాకు నేనే వచ్చితి.

రావ—నీ తండ్రికిని మాకునుం గల స్నేహానుబంధముంజేసి నీవును మాకు మిత్రకోటిలోనివాఁడవు.

అంగ—మిత్రకోటిలోనివాఁడనో! శత్రుకోటిలోనివాఁడనో! దోర్మూలమున నిన్నదిమిపట్టి చతుస్సాగరీసేవసేసి వచ్చిన వానరచక్రవర్తికి వాలికి గారాబు బిడ్డఁడ; మఱియు నీవు చెఱగొని తెచ్చిన సీతా మహాదేవికి జీవితేశ్వరుండగు మారీచ మథనుని సందేశ హారుఁడ.

రావ—ఓరీ! వలీముఖార్భక! రాముఁడేమి సేయుచున్నాఁడు?

అంగ—ఓరీ! వలీముఖ విభు విధేయ! సావధానుఁడవయి విను!

సీ. కనకైణ విభ్రాంతిఁ । గావించు మారీచు
చర్మ మయ్యది మృదు । శయ్య గాఁగఁ

ప్లవగేంద్రుఁ డూరు బిం । బము దిండుగాఁ జేసి
వీక్షానుసారియై । వేడ్క మెలఁగ
కుపితాత్ముఁ డల్ల లం । కా పుర లుంటాకుఁ
డంజనా సుతుఁడు తా । నడుగు లొత్త
రాక్షస వ్యూహాద్మ । రంబైన విశిఖ పా
తంబు తమ్ముఁడు ప్రపా । తంబు సేయ
గీ. రక్కసుల పాలి మఱువు మ । ర్మంబు లెల్ల
శరణుసొచ్చిన మీ విభీ । షణుఁడు నొడువ
భాను కుల భూషణుఁడు రఘు । ప్రభుఁడు వింటి
వంక వీక్షించు మఱి లంక । వైపుఁ జూచు.

రావ—ఇందుల కేమని పనిచె నిన్ను?

అంగ—నీతి కోవిదుఁడు గావున నమ్మహాభుజుఁడు నేయెత్తి నీతో గొన్ని మాట లాడుమని; విను!

సీ. పరవధూ హరణంబు । పౌలస్త్య! నీయట్టి
దోష్మంతునకుఁ దప్పు । త్రోవ యనియెఁ
బొరపాటు పని యంచుఁ । బుడమి కాన్పు నొసంగి
పరఁగఁ గేల్మోడ్చుట । పాడి యనియెఁ
గాదేని కవచివై । కరముల విండ్లూని
నిమిషంబు కాలాఁగి । నిలువు మనియె
విలయ శోచిష్కేశ । వినిమయంబులు నిన్ను
సౌమిత్రి శరములు । సైఁప వనియె
గీ. నిబిడ మగు తపస్యకు మెచ్చి । నీకు విశ్వ
సృజుఁ డొసంగిన వర మిందుఁ । జెల్ల దనియె
నుక్కువుల నడ్మ నెందఱ । నొడ్డుకొనినఁ
దగవు దప్పిన నీ చావు । తప్ప దనియె.



రావ—మాటలవాఁ డవును రాముఁడు!

అంగ—అదేమిమాట?

ఉ. మాటలవాఁడు గాఁడు రఘు । మండనుఁ డమ్ములవాఁడు దానికిం
దాటక చావె కండు భృగు । తల్లజు ధిక్కరణం బొకం డనిం
బాటితుఁడైన మీ ఖర సు । పర్వవిరోధి యొకండు సాక్షులై
చాటరె వీర గోష్ఠులఁ బ్ర । సంగములన్ వినవే? దశాననా!

రావ—ప్రాపంచిక జ్ఞానము లేనివాఁడు గావున రాముఁ డట్టులాడుఁ గాక! నా భుజప్రతాపానలమునకు వాఁడెంత? వాని తమ్ముఁ డెంత? నీ సేమముం గోరి నొడువుచున్నాఁడ వినుము! పితృణ విముక్తిం బొరయుటకు నమ్మి నా సన్నిధి నుండు! నాయంతటివానిం జేసెద!

అంగ—కైలాసమునడుగునఁ బడి నలిగినవాఁడ వెంతటి వాఁడ వీవు?

రావ—ముందటి కోఁతిం దలంచుకొని మోటుతనము మానుము!

అంగ—తోఁక గాల్పించుకొనుటకు వాయుసుతుఁడు గాఁడు వీఁడు వాలిసుతుఁడు! గద్దెపొంకము లాడక యెఱిఁగి ప్రత్యుత్తర మిమ్ము.

రావ—ఆ రాచ బడుగునకు బదులాడు నా పలుకు లివి.

సీ. వీరాగ్రణుల కెందు । విశ్వైక దృగ్బంధు
వస్త్రాపహృతి సుప్ర । శస్తి కనుము!
చేచిక్కినట్టి యో । షిద్రత్నములఁ దెచ్చి
వెండి యిచ్చు వెడంగు । లుండ రనుము!
నిమిషంబు కాలాఁగి । నిలుమనుటకు నన్ను
సుంత మర్త్యుండు తా । నెంత యనుము!
ముని మృగంబుల పయిం । బోలె మా పయిఁ దమ
సాయకంబులు పని । సేయ వనుము!

గీ. లేని పోని బింకాలు చా । లింపు మనుము!
రాక్షసులు వీరు రిపు వీరా । పాక్షు లనుము!
బ్రతుకునందాస గలదేని । పడతియందు
వదలుకొమ్మను! పొమ్మను! । కదలి వేగ.

అంగ — వ్యామోహావశంబున నిటు లాడెదవు గాని నిజము నీకును హృదయ గోచరము.

ఉ. మ్మాటలకేమి? రాముఁ డతి । మానుష సారుఁడు వానిదౌ భుజా
పాటవ మోర్వఁజాలరు సు । పర్వులు నాజి నెదిర్చి! యిక్కకై
మేటిపయోధి నమ్మమొన । మీటినవాఁ డెటువంటి శూరుఁ డ
ప్పోటరి పాటు నూడ మిము । బోంట్లకు దిక్కు దివాణమేమవున్?
నీవు కుఱుచనని కాదు; కలరూపు సెప్పితి.

సీ. త్రచ్చినాఁడవు నీవు । త్రైవిష్టపుల నజుం
డొసఁగిన వరము చే । యూఁత గొంచు
నిజ! మర్జునుఁడు వాఁడు । నినుఁబట్టి వింటిత్రా
టం గట్టె రేవా త । టమునయందు
నా హైహయుని దోస్స । హస్రంబు నఱుమాడి
పొడిచె భృగుస్వామి । భూరి భుజుఁడు
మా రాఘవుఁడు నెట్టె । మఱి పరశ్వధ హస్తు
నవ్వానిఁ జివ్వ రు । ద్రావతారు

గీ. శిష్టులను బ్రోవ దుష్టుల । శిక్ష సేయ
విపుల తేజంబుతో నుర్వి । వెలసినట్టి
భగవ దవతార మూర్తితోఁ । బ్రతి ఘటించి
ప్రాణములతోడ మనియేదే? । పంక్తి వదన!

మఱియు ఖర దూషణ త్రిమూర్ధాదుల నొక్కఁడ యుక్కడంచిన మొక్కలీఁ డతఁడు! పర్యవసానము విను!



మ. సహసోదర్యుఁడు రాముఁ డల్క గదురన్ । సంగ్రామరంగంబులో
విహగేంద్రాయిత వేగ బాణములతో । వీక్షించి నీ కంధరా
గహనాభోగము నీఱు సేయు తఱి నిన్ । గావంగ మృత్యుంజయ
ద్రుహిణేల్ దక్షులుగారు వారును సుర । స్తోమంబుతో వచ్చినన్.
వింటివా? శ్రద్ధాళుఁడవయి వినుము!

మ. విలయోద్దీప్త పతంగ మండల సమా । విర్భావ దుర్భావుల
య్యలఘూత్సాహులు రామలక్ష్మణులు తీవ్రారంభులై యాశుగ
జ్వలనజ్వాలలు పెల్లు గుప్పి మిము గీ । ర్వాణారులం జెండుచో
నళికాక్షౌజులు నాఁగఁజాలరు సురా । ఘూర్వీతులై వచ్చినన్.

రావ — ఓరీ! వదరుఁబోతా! ప్రేలక పొమ్ము!

అంగ — జగన్మాతను జానకి నీయవు!

రావ — ముమ్మాటికి.

క. మణులును మాధుర్యవతీ
మణులుం జేపడిరయేని । మనకౌనక సమ
ర్పణసేయు వెడఁగు లుందురె
గణనకు? నది యెంత పుణ్య । కాలంబయినన్.

అంగ — అవును! లోటిపిట శూల రోకండ్లఁగాని పోదు. అల్లే

చ. కపిభటు లుగ్రసింహములు । కై వడిఁ దాఁకకమున్నె ముక్కరుల్
తపఁదపఁ దాఁడిచెట్లవలె । దైత్యులు గూలకమున్నె నీ తలల్
కుపిత రఘూద్వహాస్త్రముల । కుం గురియై పొడిగాకమున్నె యీ
చపలత వోయి నీకు బుజు । చార మదెట్లు పలాద భర్తకున్.

రావ — దూతవని యే నూరకున్నను జంద్రహాస మూరకుండదు.

అంగ — వెడలెదను! నీకును నీ చంద్రహాసమునకును వెఱచికాదు. ఒండు సేతకు రామాజ్ఞ లేమిం జేసి, కాని

చ. అది సనుదెంచు ఘోర విల । యార్క విషహ్యము రామలక్ష్మణ
ప్రదర మహాగ్ని లంకపయిఁ । బర్వి పతంగములంబలెన్ మిమ్మున్
వదలక దైత్యయోధుల న । వార్య తరస్వుల నిర్దహించుచుం
బడపడి మీరు మీ హితులు । పాయక నిల్వుఁడు! పోయివచ్చెదన్.

(నిష్క్రమించు.)

(తెరలో) కలకలము.

రావ — అదేమి రవళి?

ప్రహ — కపిబలముల హాళాహళి! దేవర ప్రతివిధానము నాలోచింప వలయు!

రావ — ప్రతివిధానమున కేపాటి?

(వసంతతిలక)

మందోదరీ చరణ । మండన శింజితశ్రీ
చందం బిదిం బ్లవగ । సంతతి వాళితంబున్
డెందంబునం బ్రణిబి । డీకృత నిష్ప్రమాణా
నందంబ సేయు మఱి । నాకు నభిన్న భంగిన్.

(మందోదరి ప్రవేశించును.)

మందోదరి — విధిసంకల్ప మవికల్పము!

సీ. మాయా కలాప ని । ర్మాణాభినవ ధాత
మారీచుఁడు మృగంబు । మాడ్కి మడిసె
దలపూవు వీర ర । త్నములకు మఱి వాలి
చిటికలో నామావ । శేషుఁడయ్యెఁ
త్రిదశాస్త్రు ధారా న । దీ మాతృకము లంక
మర్కటం బది సిచ్చు । మయము సేసె
సభ్యుఁడయ్యెను విభీ । షణుఁ డగ్రజుని వీడి
యభియాతి చరణంబు । లాశ్రయించెఁ



గీ. బ్రదర వహ్నికి జఠరంబు । వగిలి ప్రళయ
భైరవం బుదన్వంతంబు । పాయవడియె
నడవి గోలలు నెవరికి । నలవి గాని
కట్టగట్టిరి శైలవ । ర్గముఁ తోడ.

(సమీపించి) విజయ సూర్యపుత్రునకు!

రావ — దేవీ! యిట్టిటు!

మందో — (విషాద మభినయించును.)

రావ — (తిలకించి)

గీ. లేత వెన్నెల జిగుల జ । ల్లించు సుస్మి
తాంకురంబులు వెలయు నీ । యాననామృ
తాంశు మండల మది చకో । రాక్షి! నేఁడు
చిన్నవుచ్చెద విదియేమి? । చెప్పఁగదవె!

ప్రహ — అశ్కోనమనుకుల క్రిందు కారణమయి యుండు!

రావ — చాలుఁజాలు! కొండముచ్చుల కీచుకీచులా చింతామూలములు?

మందో — అటు లఘూకరింపకుఁడు!

సీ. గంగ మంగళ సూత్ర । భంగ మా ననుచు న
య్యమున నేమేమొ తా । నడిగెనంట!
సంకోచపడెనంట । కొంకుచు భూ కాంత
తనకింక దిసకోలల । దప్ప దనుచు!
అగ్రిజుండు త్రివిష్ట । పగ్రామణికి లోఁగు
ననుచు నీశుం జూచె । నంట భవాని!
జీమూతముల కథి । తోషంబ యనుచు వె
చ్చగ నూర్చెనంట శచీ । సహాచరుండు!

గీ. గాఢముగఁ బద్మ కేశవుఁ । గౌఁగిలించు
కొని భయంబునఁ బితృభిక్ష । గోరెనంటి!

ప్రళయ దుర్వార రయ విజృం | భణము లయిన
రాఘ వాస్త్రాగ్ను లబ్ధిపైఁ | బ్రబ్బినపుడు.

మఱియు వాలివధ విన్నది మొదలు నా హృదయము వికం
కిత మవుచున్నది.

రావ—క్రోఁతిం గొట్టినవాఁడు నొక కోదండ కుశలుఁడే? యెవరు
గఱపిరి నీ కీ పిఱికితనము ?

సీ. అసుర శిల్పాచార్యుఁ | డలఘు మాయాగోళ
మౌళి మాణిక్యంబు | మయుఁడు తండ్రి
కర కందుకీ కృత | కైలాస శైలుండు
భుగ్నారి వింశతి | భుజుఁడు విభుఁడు
బృందారకుల నడ్మ | భిదురపాణిం బట్టి
కట్టి తెచ్చినవాఁడు | కన్న కొడుకు
సమవర్తి పోతుతో | జగడ మాడినవారు
సమర శౌండులు నిశా | చరులు భటులు

గీ. స్వర్గ పాతాళ మర్త్య వి | శ్వముల నూఁది
చరణ నఖమున శాసింపఁ | జాలు దేవి
వెయ్యి నిమ్మెయి నతివిప | ర్యసిత చిత్త
వయి దిగుల్పడఁ జన్నె? ప | ద్మాయతాక్షి!

(తెరలో) హా! కష్టము! కష్టము!

సీ. పరిధులై పరగు చా | పములతో నున్నారు
ప్రళయార్క లన దాశ | రథులు వీరు
తలలు గోల్పడి తప | తపఁ గూలుచున్నారు
దృఢ సంహననులు దై | తేయ భటులు
కురియుచున్నారు కా | ర్కొనిశిలా సారంబు
పుష్కలావర్తకం | బులనఁ గపులు



బిగువేది యిది లంక | ప్రేవులతో నిండి
రుధిర పూరములచే | రొంపి యయ్యె

గీ. పూర్వ గీర్వాణు లడుగంటి | పోక మున్నె
క్రొచ్చు సెడి త్రికూటము బూది | గాక మునుపె
కుంభకర్ణుండ! నిద్ర మే | ల్కొనఁ గదయ్య!
మేటి విలుకాని రావయ్య | మేఘనాద!

రావ—అందనుక వచ్చెనా నర వానరుల క్రందు? (ప్రహస్తునితో)
నీవు సని "యెప్పటి దప్పుడు పోరి చొప్పు మాకు వినిపింపు"
మని మాల్యవంతునితోఁ జెప్పుము!

ప్రహ—చిత్తము! (నిష్క్రమించు.)

మందో—ప్రాణేశ్వరా! శబరాలయమునకుఁ బంపి శకున మడిగించిన
నదియు—

రావ—కాకతాళీయము లవి జ్యోతిశ్శాస్త్ర శకునములు.

(పటాక్షేపమున సేవకుఁడు ప్రవేశించు.)

సేవ—దేవా! దేవ!

గావ—రణ విశేషములు?

సేవ—గుబ్బెతల చనుపోఁట్లవలన నిద్రమేల్కొని ప్రధనభూమిం
జొచ్చి చిఱుగోఁతుల మ్రింగి పెనుఁగోఁతుల చెంపలు సెలవి
దేవరతమ్ముఁడు రామునిని; శక్రుం జెఱగొన్ననాఁటి విక్రమ
స్ఫురణముతో విల్లు మ్రోయించుచు మన లంకఁ గాల్చిన పెద్ద
కోఁతిం గీచుమనిపించి కుమారుడు మేఘనాదుఁడు లక్ష్మణునిం
దలపడిరి.

రావ—తరువాత?

సేవ—రాముఁడు విఱిగె ననియు లక్ష్మణుఁడు నచ్చె ననియు నిరు
తెగల వారు ననుకొనిరి.

రావ—(మందోదరివైపుఁ జూచి) తలోదరీ! తీఱినదా నీ జళుకు?

మందో—శేషముఁ జెప్పనిండు!

రావ—సేవకా! పిమ్మట?

సేవ—దేవా! అంతలో నిర్ఘాతోగ్రములై వెండియు రామలక్ష్మణుల ధనుష్టంకారములు సెలఁగినవి.

రావ—పిదప?

సేవ—పిదపటి దొమ్మి సెప్ప నలవికాదు.

రావ—దేవి వేగిరపడుచున్నది; పర్యవసనముం జెప్పుము!

సేవ—దేవా! యేమి సెప్పుదుఁ బర్యవసానము!

సీ. గుంజి కాలుని పోతు । కొమ్ము నూడ్చి యెవండు
బలవైరి కుంభి కుం । భములు వ్రచ్చె

రావ—అవును! తమ్ముఁ డఖర్వ బల గర్వుఁడు.

సేవ—

సీ. పౌలోమి జాళువా । పైఁట సించి యెవండు
వేడ్కమై సిడము గా । వించుకొనియె

రావ—కుమారుఁ డతికుమార విక్రముఁడు.

సేవ—సీ. బొక్కెఁ జక్కిలములం । బోలె నెవం డాజి
నాకౌకసులు గుప్ప । నా సముల

రావ—తమ్ముని కది వెన్నకుడుపు.

సేవ—సీ. విబుధవీరు లెవండు । విల్లందినప్పుడు
కంపలం బడినట్టి । కాకు లయిరి

రావ—అది జగద్విదితము.

సేవ—గీ. కులగిరి స్వరు తుల్యులు । కుంభకర్ణ
మేఘనాదు లిర్వురు నట్టి । వే టిదొరలు



రావ—శేషము విస్పష్టము. రామలక్ష్మణులను రణరంగమందు విగతజీవులఁ గావించి విజయు లయిరి.

సేవ—(డగ్గుత్తికతో) గీ. రామలక్ష్మణ ఘోర నా । రాచవహ్ని

రావ—నిజభుజాసార మహిమచే నెట్టినారు.

సేవ—(కన్నీటితో) గీ. శిఖల పాలయి కీర్త్యవ । శేషు లయిరి.

మందో—హా! చచ్చితి! కొడుకా! (మూర్ఛిల్లు.)

రావ—హా! తమ్ముఁడ! కుంభకర్ణ! హా! కుమార! మేఘనాద!

(మూర్ఛిల్లు.)

సేవ—(తనలో) భువన చక్రమున దశాపరివర్తన. మెవరికిని జక్రనేమిక్రమమునం గ్రిందుమీఁదుల నగు! రక్షస్సామ్రాజ్యైకధురీణుండును జగత్త్రియ విజిత్వరుఁడు నయిన యిమ్మహారాజ. రావణునకే యిట్టి కష్ట మొదవినపుడు నిచ్చలు సుఖ మెవనికి నగు? (ప్రకాశము) దేవా! ఉపశమిల్లుఁడు!

రావ—(మూర్ఛఁదేఱి) హా! అనుజా! తనుజ!

సీ. హేమాచలంబుపై । నెక్కి వప్రక్రీడఁ
గావించుఁగాక ది । గ్వారణములు!
సఖులతో జతగూడి । శచి వెండియుఁ జరించుఁ
గాక నందనవీధి । కలవయాళి!
తల యెత్తుకొనుఁగాక । తన యూథమునయందు
సంభృతానందమై । జముని పోతు?
సంతరింతురుగాక । శయనీయ సదనంబు
శోభన వ్యగ్రలై । సుర యువతులు!

గీ. నాగరాజునకుం గూర్మ । నాయకునకు
సందియలు గూటఁ బడుఁగాక! । కుడిచి కూడి

సుభగులై సిగ పువ్వులు । చుట్టుకొంద్రు
గాక వాసవుఁ దొట్టి నా । కమునవారు!

హా! పుత్రా! సుత్రామ జైత్ర! నీ యట్టి సుతరత్న మెన్ని జన్మములను నాకు లభింపఁడుగద!

సీ. మాయా గురుఁడు తాత । మయుఁడు నేర్పిన మహా
మాయ లెమ్మోయి నవి । మాయ మయ్యె?
మృడుఁడు జన్నమునందు । మెచ్చి యిచ్చిన తామ
సియు నది యెమ్మోడ్కిఁ । జిటిలి పోయె?
దేవాసురులకైన । దృగ్గోచరుఁడవు గా
కనిసేయు నేర్పెట్టు । లపసరిల్లె?
బవరమున బిడౌజుఁ । బట్టి తెచ్చిన నాఁటి
భుజ బల మేరీతిఁ । బొల్లువడియె?
గీ. మూఁడు లోకము లేకమై । మొనలు పన్ని
తాఁకినం ద్రోయఁ గల ధను । ర్ధరుఁడ వీవు
చిట్టచివరకు నొక మర్త్యు । చేత విఱిగి
యుసుఱుఁ దొఱఁగితె తనయ! చి । చ్చూఁది మాకు!

(మందోదరివైపు దిరిగి) దేవీ! ఊఱడిల్లుము!

మందో.—(ఊఱడిల్లి) హా! వైరి వీర హంస మేఘనాద! మేఘనాదా! యీ శోకాంధతమసమునుండి న న్నుద్ధరించువా రెవరు?

రావ.—దేవీ! యిదిగో!

గీ. ప్లవగ పంకజముల విజృం । భణము మాన్పి
భూతల మరామ లక్ష్మణ । ముగ నొనర్చి
తరుణి! తావక శోకాంధ । తమస ముడుపు
నసుర విహితము నా చంద్ర । హాస మిపుడు!



సేవకా! నీవు చని రథ మాయితము సేసికొనిరమ్మని సారథితోఁ జెప్పుము!

సేవ.—చిత్తము. (నిష్క్రమించు.)

రావ.—దేవీ! యేను జని సపత్నులఁ జక్కాడి వచ్చెద. (నిష్క్రమించు.)

మందో.—ఏనుం జని భర్తృవిజయార్థము కులదేవతలం గొలుతు! (నిష్క్రమించు.)

ఇది
శ్రీ బ్రహ్మానంద విరచితము జగదానందము
షష్ఠాఙ్కము





శ్రీరస్తు

బ్రహ్మానందీయము

# జగదానందము

## సప్తమాఙ్కము

(సపరివారుఁడు రాముఁడు ప్రవేశించు.)

రాము—అరి విభీషణా! విభీషణా! కడలి నింకించిన మా కలంబముల కసుర వాహిను లింకను సావశేషములు.

లక్ష్మణుఁడు—ఇంకను లంకంగల శూరు లెవరు?

విభీషణుఁడు—రామా! రఘుకుల సోమా! శత్రు సముద్రావతరణ మిఁగ మనకు గోష్పద మాత్రావశేషము. ధూమ్రాక్ష విరూపాక్షులు, నరాంతక సురాంతకులు, నతికాయ కుంభకర్ణులు మున్నగు మహావీరులు పెక్కండ్రు మడిసిరి; మఱియు రక్షోరాజునకు దక్షిణభుజాదండము, లంకా రాజ్యలక్ష్మికి విజయ ధ్వజము, గీర్వాణ బాణ వృష్టికి నవగ్రహము, ధాతృ చతుర్ముఖీ స్తోత్రములకు విశ్రాంతి నిలయము నయిన శక్రద్విషు నెప్పుడు గెల్చితి మప్పుడ విజయుల మైతిమి; దానవ స్కంధావారమున దశకంఠుఁ డొక్కండ మిగిలిన శూరుఁడు. వాఁడును సుత వధ వ్యాకులీకృత హృదయుఁడై యనిసేత కిప్పుడు చనుదెంచు.



(తెరలో)

ఉ. పైకి వహించి పుచ్ఛము ల । పాంపతిసేతువునుండి పాఱిపోం
డోకపులార! మీరు విన । రో మఱి మద్భుజవిక్రమోష్మమున్!
నాకవిభుండు వాఁడు కద । నంబునఁ దాఁ జవి చూచి సుంతయా
డాకకు నోడి భీతుఁడయి । డాఁగె సుమేరు గుహాంతరంబులన్.

విభీ—దేవా! అదిగో గపియూథపతులఁ గాందిశీకులఁ జేయుచు గీర్వాణ విద్రావణుఁడు రావణుఁడు వచ్చుచున్నాఁడు.

లక్ష్మ—రానిమ్ము!

సుగ్రీవుఁడు—(తనలో) కౌంభకర్ణ కరయంత్రణ నిపీడనముల నలిఁగి యున్న యే నిందుఁ బాల్గొనఁజాల.

హనుమంతుఁడు—(తనలో) రావణి శరక్షతంబులఁ జినిగియున్న యే నిందు నక్షముఁడ.

(తెరలో) కీచుకీచుమని బెదరి చెదరకుఁడు. సుపర్వ గర్వ నిర్వాపణుఁడు రావణుఁడు వీఁడు మిమ్ము శాఖామృగములఁ జీరికిం గొనఁడు.

లక్ష్మ—(తెరకెదురుసని) అరే వీరమ్మన్య!

గీ. బవరమున నీకుఁ గార్ముక । పాణి నవుచుఁ
గరికి మార్కొను సింగంబు । కరణి నుంటి
గర్వకండోల! రమ్ము! నీ । కంధరములు
తునిమి తూటాడుదు సురదుం । దుభులు మ్రోయ.

(రావణుఁడు ప్రవేశించు.)

రావ—డంబాలమారి వెవఁడ వీవు?

లక్ష్మ—చెప్పెదఁ జెవులార వినుము!

సీ. భగినివై నీకుఁ గా । పథ విహారిణి వైన
కులటకు ఘ్రాణంబు । కొసరి కోసి

మొనసి మధ్యేమార్గ । మున మచ్చరించిన
యోజన బాహు బా । హువులు సెలవి
ధాన్యమాలిని నీకుఁ । దాఁ గన్నతనయు ము
ష్కరు నతికాయు ని । ష్కాయుఁ జేసి
నిత్యజైత్ర రథుండు । నిఖిలాస్త్ర సంవేది
సంక్రందనారి మ । స్తకముఁ దునిమి
గీ. ఫూత్కరించెడు ఫణిరాజు । పోల్కి నున్న
సాయకమునకు నీ శిర । స్సముదయంబు
దర్దురాభము గావింపఁ । దడవుచున్న
యినకులుఁడు వీఁడు సౌమిత్రి । యెఱిఁగికొనుము.

రావ—(కహకహతో) సౌమిత్రివా? నీ చేవ చెప్పనక్కఱలేదు.
ఈవు మొనగాఁడ వనుకొని । యింతిచెంతఁ
గాపువెట్టి యవ్వలికి న । గ్రజుఁడు సనఁగ
నొంటి మెయిఁ గుటీరముపొంత । నుండలేక
పాఱిపోయిన పందవు । పద తొలంగి!

పాపఁడవు; మా బోంట్ల భండన ప్రచారముల నాగఁజాలవు; తొలఁగుము!

లక్ష్మ—ఓరీ! విచార విదూర!

ఉ. పాపఁడ నౌదుఁగాక! నినుఁ । బాపిఁ బరాసునిఁ జేయుపొంటెఁ బృ
థ్వీపరివేషమందుఁ బ్రభ । వించిన దండధరుండ నిమ్మెయిం
బాపఁడు గాఁడె నాఁడు బలి । పాలికి వామనమూర్తి? యా బృహ
ద్రూపు నణంపఁడే? పిడుగు । తూఁటొనరింపఁగఁ జాలదే గిరిన్?

రావ—ఎంతవట్టున్నది నీ యాశ!

క. బెండువడె నింద్రు కులిశము
భండనమునఁ దాఁకి; లోక । పాలురకు నభే



ద్యుండనగు నాకు నీయవి
కాండంబులు కత్తృణములు । గావె కనిష్ఠా!

లక్ష్మ—ఎంత నుతించుకొన్నను గపిల మహాముని చేతి చపేటమున సగము చచ్చిన జజ్జ వీవు.

రావ—ఎట్టెట్టూ? త్రిభువనైకవీరుఁడయిన రావణుని తేజోభానునకును గ్రహణపు మొఱ్ఱియా?

లక్ష్మ—అబలా చరణావధూతుఁడవు నీవా త్రిభువనైకవీరుఁడవు?

మ. ఒకనాఁడా బలిఁ జూడఁ గోరి మదిలో । నుత్సాహివై పోవఁ ద
త్ప్రకటాంతఃపుర ముగ్ధబాలికలు వీరమ్మన్య! హస్తానుహ
స్తిక నాడింపరె? నిన్నుఁ బువ్వనుచు ధా । త్రిం జిమ్మరే? చిమ్మిచూ
చికడుం ద్రోయరె పాదపద్మముల మం । జీరధ్వనుల్ మ్రోయఁగన్.

రావ—అవును! ఆడువాండ్రపై రావణుఁడు దోస్తంభము లాడింపఁడు.

లక్ష్మ—కైలాసముక్రిందఁ జిటిలిన నీకు దోస్తంభము లాడుటెట్లు?

రావ—అది మా పురాణ పితామహుఁ డనరణ్యుఁ డెఱుఁగు.

లక్ష్మ—కాదుకాదు; తప్పఁబలికితివి; కార్తవీర్యుని బిచ్చమడిగి నిన్ను జెఱ విడిపించిన మీ పితామహుఁడు పులస్త్యుఁడు—

శా. తారుణ్యాఢ్య వధూకరాంబురుహయం । త్రప్రోజ్ఝితాంభస్స్ఫుర
ద్ధారా పంజర కీరమై మదిఁ బ్రమో । దంబొప్ప రేవాధునిన్
వారిక్రీడల నాడు హైహయుఁడు దో । ర్వల్లీ వినోదంబు సొం
పారన్ నారి సమర్చి కట్టినవి కా । వా నీవి దోస్తంభముల్?

మఱియు

శా. జ్యారావంబునఁ బుష్కరం బెదురు మ్రో । యం బేర్చు నవ్వాని ను
గ్రారంభుం డలుకన్ సహస్రభుజుఁ జెం । డాడెన్ భృగూత్తంసుఁడ
వ్వీర్యున్ మే మెటు త్రోసిపుచ్చితిమి? నీ । విక్రాంతి యేపాటి? య
ప్పారావార నిషంగుఁ డద్దుకొనినన్ । భంజింతు నిన్నుక్కివున్!

తెలిసినదా? తెలియ దేని యింకను విస్పష్టముగ వినుము!

శా. వేచేతుల్ గలవాఁడు హైహయుఁడుపృ । థ్వీన్ మించెనిన్నుగ్రుఁడై
యాచాంతారియశుండువానిభృగుపం । చాస్యుండుసించెన్; వడిం
ద్రోచెన్ మా శర మాజి నప్పరశుహ । స్తున్; నీచముల్ నీవి దో
ర్మోచా స్తంభములేమిలెక్క?నిలు! ని । ర్మూలింతునియ్యమ్మునన్.

రావ—విద్రావితైరావణుఁడు రావణుఁడు వీఁడు మాటలకు బెదరి పాఱఁడు.

లక్ష్మ—పాఱవలయునన నమ్ములు పాఱనీయవు.

రావ—ఓరీ! శుంఠా! దశముఖునితోడనా వీరవినోదము?

లక్ష్మ—చతుర్ముఖునికి మునిమనుమఁడవు; మొగముల కేమి కొదవ? పౌరుషముమాట విచారించుకొనుము!

రావ—మహేశ్వరుని మెప్పించిన మా పౌరుషము మానవులకు మీకెట్లు గోచరించు?

లక్ష్మ—అవును! అర్ధనారి మెచ్చిన పౌరుష శాలివి.

రావ—ఎఱిఁగి మాటాడు!

చ. వెఱవక యించుకేని మది । వీఁకమెయిం గరవాడి కత్తితోఁ
దఱిగి తలల్ నిజంబు లివి । ధాతకుఁ బ్రీతిగ వ్రేల్చినట్టి బల్
మెఱియఁడు వీఁడు రావణుఁడు । మేటి ధనుర్ధర కోటికెల్లఁ జి
చ్చఱపిడు గెట్టు లట్టు లని । సైఁపఁడుసూ ప్రతిపక్ష గర్వముల్!

లక్ష్మ—ఎఱిఁగిన వాఁడవేనా నీవు?

ఉ. తాతకుఁ బ్రీతికై తలలు । తంపటివేసెడు వేళ నీవు మా
చేతను జత్తువంచతని । చే లిఖితంబయి యున్న వ్రాఁత వి
జ్ఞాతము గాదె నీకు మఱి? । జ్ఞాత మదయ్యె గరాసవై యథా
జాతుఁడ వౌటఁజేసి కద । చావఁగ వచ్చితివిట్లు పోరికిన్!.

ఓరీ! రావణ! ఆత్మ స్తుతితోఁ బనిలేదు. కావున



గీ. సంయమనికి బోవఁగ సంత । సంబ యేని
వేగ పెద్ద తమ్ముని మాడ్కి । విల్లు వంచు!
సతియు నిహామున మనఁగ స । మ్మదమ యేని
చిన్నతమ్ముని మాదిరి । శిరము వంచు!

రావ—సూర్యునితో పాటు సూర్యకాంతము; నీవును రామునితో పాటు; పృథక్ప్రయత్న మనపేక్ష్యము. (ముందటికిఁజని) ఏఁడీ రాముఁడు?

రామ—ఓయీ! పౌలస్త్యవంశవర్ధన!

చ. వలదు చలంబు! వారని వి । వాదము సేయకు! మించలేదు! నా
పలుకిది విన్మ! తీర్థజల । పావని దీపశిఖా ప్రతీక్ష్య ని
ర్మలమతి నిమ్ము సీతను! గ । రంబులు పిమ్మట మోడ్చికొంచు న
య్యలఘు భజింపు లక్ష్మణుఁ బ । దాబ్జములం బ్రణమిల్లి! మేలవున్!

రావ—అహాహా! అన్నదమ్ముల పరస్పర దూషణ మవనీ సురుల యందువలె నన్యోన్య నుతి మీ రాచ వారియంద చూడ వలయు. వెడమాట లాడక విపులమతి నరసికొనుము!

గీ. మాఱుఁదల్లి కైకేయి ఛ । ద్మంబు పన్ని
చల్లచల్లఁగ నవలికి । సాఁగదోల
బీర ముడివోయి వచ్చిన । బేల వీవు
సీత యేటికి నీకుఁ? గా । శిక భుజిష్య!.



రాము—అటేని యిటు విను!

క. వాలి గళ శోణితంబుం
గ్రోలినయది కలదు రమ్మ! । కొంకక; నిన్నా
వాలారు నారసమునకుఁ
జాలిన పారణము గాఁగఁ । జయ్యనఁ ద్రుంతున్.

రావ__కైలాసముఁ గేల నాడించిన వింశతిభుజునకు నాకు నరుఁడవు నీవెంత?

క. వా రర్కులు పన్నిద్దఱు
భూరి నిజ కులాభిమాన । మున బాసటయై
తారు సనుదెంచి పొదివిన
ఘోర పృషత్కములతోడఁ । గూల్చెద నిన్నున్.

రాము__కైలాసము నాడించితివా?

క. నిజ చరణాంగుష్ఠంబున
నజగవ ధన్వుండు మీఁద । నలఁతిగ నదుమన్
రజతాద్రి క్రింద వింశతి
భుజ! కూయవె దశ శతాబ్ద । ములు? మఱచితివే?

మఱియు

క. వాలి యవలీలఁ దన దో
ర్మూలంబున నిను కుళీర । ముంబలె గొను న
వ్వేళ నను భీతి నలమట
పాలై యడలితివి స్మృతి ప । థంబున లేదో!.

రావ__విద్రావితై రావణుఁడు రావణుఁడు వీఁడు క్రోఁతులం గొట్టు వాఁడు కాఁడు.

క. బిగువులు వల్కక విలు గొని
మగచందము గలద యేని । మార్కొను! ముని
యున్ మృగము నని మదిఁ దలంపకు!
పగఱకు గుమ్మిండు వీఁడు । బవరమునందున్.

రాము__విమర్దన క్షమ మైన సమరోచిత ప్రదేశమునకుఁ బోవుదము రమ్ము!



శా. బెండై వ్రస్సె మహేశుచాప మదియుం । బెంపేది యొందున్ హాతా
శుం డయ్యెన్ భృగువీరుఁ డప్పరశుహ । స్తుండుం గఠోరంబు దో
ర్దండంబయ్యది సెండు నిన్నిపుడు దు । ర్వారాభమై వాలితో
గొండాడం దగు కీర్తి వెల్లువలు ది । క్కూలంబులం ద్రోయఁగన్.

రావ__రామా! నా సమర సంరంభ మెఱుఁగవు—

మ. త్రిదశేభంబులు కట్టుపట్లు విడుచున్ । దిక్కూలముల్ గూలు! న
య్యుదధుల్ దాట్రిలిగట్లపైఁ బారలు! గో । త్రోత్తంసముల్ శైలముల్
కుదురుల్ తప్పిపడున్ ఫణీంద్రుఁడుకడుం । క్రుంగున్ మహాకూర్మముం
జదియున్! నాకదనంబు సేయు తఱి వి । శ్వంబున్ విధూతంబవున్
చూచెదవుగాక! రమ్ము!

రాము__లక్ష్మణా! విల్లిటు గొని రమ్ము!

రావ__(ఆకసమున లక్ష్య ముంచి) ఓ కూర్మోరగ కిటిరాజులార క్రుంగెదరు! సావధానులరు కండు! గీర్వాణవిద్రావణుఁడు రావణుఁడు రణ సన్నద్ధు డయ్యెడి!

రాము__కాల యాపనము సేయక కదన భూమికి రమ్ము!

రావ__ఇదిగో!

లక్ష్మ__పద! మృత్యుముఖముం జొచ్చెదవు!

(నిష్క్రమింతురు.)

విభీ__మయునకు నల్లుఁడయిన వీఁడు బలు మాయలాఁడు; మాయా మర్మములు సెప్పుట కేనును రాముని పిఱుంద నయ్యెద.

సుగ్రీ__అదిగో! అంబరచరు లాయోధ నాలోకనోత్సుకులై విమానములతో విచ్చేయుచున్నారు; బవర మతి భయంకర మగు! ఏనుం బ్రధన భూమికి వచ్చెద.

హను__ఇదిగో నేనుం జనుదెంచి ప్రమథులు మున్ను కైలాసము

క్రిందఁ జతుకఁ ద్రొక్కినను జతుకని గట్టి తలలు నేఁడు నా ముష్టిఘాతములఁ బిండి సేసెద.

(నిష్క్రమింతురు.)

(విద్యాధర మిథునము ప్రవేశించు.)

విద్యాధరుఁడు—అత్యద్భుతోద్భ్రాంత వియచ్చర మీ రామ రావణ యుద్ధము.

విద్యాధరి—ఇరువురు నసాధారణులు.

వి—డు—అవును.

సీ. గౌరి కంపము నొంద । గణములతో శివ
శైల మూఁపిన బల । శాలి యొకఁడు

వి—రి—అంబరం బదియెల్ల ।నవియఁ ద్రొక్కి దండ
దండంబు విఱిచిన । దట్టుఁ డొకఁడు

వి—డు—హరిచేతి చక్రంబు । నతివ దుద్దుంబోలెఁ
జులకఁ జేసిన రణ । శూరుఁ డొకఁడు

వి—రి—దావానలమువంటి । తన్మూర్తి నోడించి
విజయ మొందిన మహా । వీరుఁ డొకఁడు

వి—డు—గీ. విధి నుపాసించి కల ధను । ర్వేద మఖిల
మెఱిఁగికొన్న నిశాట మ । హేశుఁ డొకఁడు

వి—రి— కౌశికునిఁ గొల్చి దివ్యాస్త్ర । కళల నెల్ల
నభ్యసించిన రాజామృ । తాంశుఁ డొకఁడు.

వి—డు—పర్యవసాన మెట్లుండునో! సర్వాస్త్ర పారీణులయిన మహావీరు లిరువురును.

వి—రి—దశకంధరునికంటె దాశరథి రణనైపుణి పదిమడుంగు లెక్కువ; రావణుఁడు పది విండ్లతోఁ గురియు శర వర్షము రాముఁ డొకవింటితో నాఁగుచున్నాఁడు.



వి-డు—రావణుండును నడుమనడుమఁ దాఁకు సుగ్రీవాదుల స్రుక్కించుచున్నాఁడు; అదిగో సుగ్రీవుఁడు ఱువ్విన గిరి కూటములను దశగ్రీవుఁ డందుకొని సెలయేళ్ళతోఁ బిండలి సేసి దానితో వెండియు నతని మోదుచున్నాఁడు.

వి-రి—మచ్చరమున మన వియచ్చరులు గురియకున్నను రక్షో వీరులపైఁ బ్రహరణీకృత పాదపములతో వలీముఖులు పువ్వుల జడిఁ గురియుచున్నారు.

వి-డు—కపి శస్త్రీకృతములయిన చందనతరుల నాశరు లంతరాళమున నందికొని తదవస్థాయులయిన దర్వీకరముల వెండియు వారిపై విసరుచున్నారు.

వి-రి—వాఁడెవఁడు పౌలస్త్యుం దలపడు గదాపాణి?

వి-డు—వాఁడుం బౌలస్త్యుఁడే; ప్రభు పక్షపాతమున నగ్రజునిపై నరుగు విభీషణుఁడు. (విషాదముతో) కట్టా! ఎటయ్యెడునో! అనుజన్మ వధోద్యుక్తుఁడై యసురవిభుఁడు మయుఁడొసంగిన మహాశక్తి హస్తమున వహించినాఁడు.

వి-రి—పడగల విప్పుతోఁ బాతాళమునుండి పైకి వచ్చిన ఫణీంద్రుని పగిది నదిగో మేను వెంచి తురగములం దునిమి సారథిం జంపి రావణుని కరమున శరాసారముం గురియుచు శరణాగత వత్సలుఁడు నడుమ లక్ష్మణుఁ డడ్డము సొచ్చె.

వి-డు—అది మఱియు విషాదమూలము; అమోఘ మమ్మహాశక్తి ఫాలాక్షునయిన నొంపఁగలయది. కటకటా! అట్లే జరిగినది. రావణ విముక్త మైన యా శక్తి కాలానల కల్పములయిన కాండములం గబళించుచు సౌమిత్రి వక్షమ్ము వ్రచ్చినది.

వి-రి—అమ్మో! ఇఁకనేమున్నది! పాపాత్ముల కోర్కులే ఫలవంతము లయ్యెడు!

(తెరలో)

గీ. అన్న! లక్ష్మణ! మాయకు । మయ్య నీదు
నయన నళినము లూర్మిళా । నయన నళిన
భద్ర రేఖలయును నాదు । ప్రాణములయు
భానుమత్కుల పుణ్య శో । భలయుఁ దోఁడ!.

వి-డు—పాపము! శోకవ్యాకులుఁడైన రామచంద్రుని విలాపమది.

(తెరలో) దేవా! ఊఱడిల్లుఁడు!

వి-డు—సుగ్రీవుఁడు రాము నూఱడించుచున్నాఁడు.

(తెరలో) హా! వత్స!

సీ. వేచేతులగు కార్త । వీర్యార్జునునికంటె
ఘనుఁడవు పాణి లా । ఘవమునందు
దోరించితివి పెక్కు । దుష్టరాక్షసులఁ గా
శిశు జన్మమునఁ జెక్కు । చెమరు గాక
మహిపుల మయ్యేడు । మార్లు సెండిన వాని
నల భృగూద్వహుఁ దోలి । తశ్రసమునఁ
గండక తునిమితా । ఖండలారి నఖండుఁ
గుసుమ ధారా వృష్టిఁ । గురియ దివిజు

గీ. లట్టి భువనైక వీరుఁడ । వధిక శోణి
తాప్లుతుండవై తమ్ముఁడా! । యవని నిట్టు
లొరగితివె? నీవు లేని నా । కువిద సీత
యేమిటికి నయోధ్యా లక్ష్మి । యేటి కదియు?.

వి-రి—ఇష్ట జన మరణ దుఃఖము లనపహార్యములు.

(తెరలో) దేవా! శోకింపకుఁడు! మృతుఁడు గాఁడు; దేవర తమ్ముఁ డిప్పుడు గాఢమూర్ఛ నున్నవాఁడు. విచ్చిన తమ్మిపూవు వోలె మొగము సుప్రభమై యొప్పుచున్నది? నయనములు సుప్ర



సన్నములు; పాణితలము లరుణములై చెన్నొందెడి; దీర్ఘాయుష్మంతుల కిట్టి శుభ చిహ్నము లొప్పు! ప్రభు భక్తి పరుఁడై చన్న హనుమ సంజీవనిం దెచ్చు! తత్సంపర్కమున నితఁ డిప్పుడ పునరుత్థితుఁ డగు!

వి-డు—సుషేణుని నుడులవి.

వి-రి—అదేమి పాపము? పెనుఁగొండ మూఁపున నిడుకొని వానరుఁ డును రాక్షస పక్షావలంబియై వాఁడు రామునిపైకి వచ్చెడిని.

వి-డు—పాపము శాంతించుఁగాత!

సీ. పసితనంబునయందు । బాలార్క బింబంబుఁ
బిసికె నెవ్వఁడు పండుఁ । బిసికినట్లు
పవి ధారచే వ్రేటు । వడియు నెవ్వఁడు పాల
బుగ్గ వ్రీలక దర్ప । మున నెసంగె
నొక పాద ముదయాద్రి । నొక పాద మస్తాద్రి
మోపి యెవ్వఁడు పార । ముం బఠించె
వైమానికులయు గ । ర్వము వాయ నెవ్వడ
య్యర్ణవంబును దాఁటె । నశ్రమమున

గీ. నట్టి భువనైక మల్లుఁ డ । హార్య ధైర్యుఁ
డక్షవిద్వేషి శత్రు గ । ర్వాపహారి
పతిత సౌమిత్రి మూర్ఛా వ్య । పనయమునకు
ద్రోణగిరిఁ దెచ్చు పవన పు । త్రుం డతండు.

(తెరలో) ఓరీ! జగద్ద్రోహీ! రావణా! నిలు! నిలు!!

వి-డు—అదిగో! సంజీవనీ సంపర్కమున నుత్థితుఁడై వెండియు సౌమిత్రి విల్లు మ్రోయించుచున్నాఁడు.

వి-రి—మరల జీవలోకమునం బ్రతిష్ఠితుల మైతిమి

వి-డు—అదిగో! రావణుఁడును రథారూఢుఁడై రాముని దెస వచ్చుచున్నాఁడు.

వి-రి—అరదముపై నున్న రావణునితో నవనిపై నున్న రామునకు దురము దుర్భరము.

వి-డు—పురుహూత ప్రేషితము సమాతలికము నైన యరదము నదిగో రాముఁడు నధిరోహించెడు.

(తెరలో)

క. లంకాతంక హరంబులు
శంకర సౌధావతంస । చాలకములు ని
శ్శంక బలాఢ్యము లమర గ
జాంకుశములు సుండి దాన । వాగ్రణి కరముల్!

వి-డు—నిజవిభువర్ణనానుసారులయిన సురవైరుల వ్యాహారము లవి.

(తెరలో)

క. లంకాతంక కరంబులు
శంకర చాపావతంస । చాలకములు దు
ష్పంకావిల దైత్య గజేం
ద్రాంకుశములుసుండి రఘుకు । లాగ్రణి బాహుల్!

వి-రి—రాఘవ గుణ వర్ణనానుసారులయిన కపివీరుల మహోత్సాహ వ్యాహృతు లివి.

వి-డు—పరస్పర జయాకాంక్షులయి రామరావణు లిర్వురు భయంకరములైన దివ్యాయుధములతోఁ బోరుచున్నారు. రావణుని తామిసాస్త్రమును రాముఁడు భానవీయముతోడను, రాముని భానవీయమును, రావణుఁడు రాహవీయముతోడను, రావణుని రాహవీయమును రాముఁడు వైష్ణవముతోడను, రాముని వైష్ణవమును రావణుఁడు పౌష్ప కేతవముతోడను, రావణుని



పౌష్ప కేతవమును రాముఁడు పాశుపతముతోడను నస్త్రమునస్త్రముతో నిర్మూలించి మీఱుచున్నారు.

వి-రి—పిలమోత్పాతము వాటిల్లినట్టు లదేమి వైమానికులందఱు కలఁగఁద్రొక్కుకొనుచున్నారు?

వి-డు—(అరసి) ఇది దానికి హేతువు

శా. సావిత్రాన్వయవర్ధనుం డటు మహా । సంరంభ మొప్పన్ దశ
గ్రీవచ్ఛేదవిధిత్సుఁడై గగనమూ । ర్తిం గ్రాలు నద్దాని నా
త్యావాజంబయి భాను పావక ఫలం । బౌదాని నత్యంత దు
ర్భావాభంబగుదానివింటఁదొడిగెం । బైతామహాస్త్రేంద్రమున్

వి-రి—(చూచి) ముల్లోకము లిప్పుడు నిష్కంటకము లయినవి.

గీ. రాముఁ డేసిన యమ్మహా । స్త్రంబు కతనఁ
దెగిన తన మస్తకములు ప । దింటితోడ
గగనమునయందు దర్శితై । కాదశార్క
మై దశాననుని కబంధ । మవనిఁ బడియె.

జానకియు నిఁక భర్తృపకంఠమునం బరిఢవిల్లు!

వి-డు—అవు నల్లె; తనదు పాతివ్రత్య మహిమము జగమున కెఱుకపడ

క. జ్వాలా జాల జటాలా
భీలంబగు వహ్నిఁ జొచ్చి । పృథ్వీసుత య
బ్బాలార్కుని కిరణావళి
వోలెం జనుదెంచె సురలు । పువ్వులు గురియన్.

మఱియు లంకారాజ్యమునయందు విభీషణు నభిషక్తుం జేసి చెఱలనున్న సురలను విడిచిపుచ్చి సీతా లక్ష్మణ పరిపూర్ణ పార్శ్వభాగుఁడై సపరివారుఁడు రాముఁ డయోధ్యకుఁ జన విమానముతో

విచ్చేసెదు; మనమును గారాగృహోన్మోచితులను బంధువులఁ జూచి యానందింతము రమ్ము!.

(నిష్క్రమింతురు.)

(యథానిర్దిష్టుఁడు రాముఁడు ప్రవేశించు.)

రాము—దేవీ! వైదేహీ!

శా. సౌవర్ణ్యాతిగ సౌధరాజ మణి చం । చత్స్వర్ణ పాంచాలికా
ప్రాకారీభవదాదితేయ భువనా । భ్రస్ఫార రాగంబు తా
రావిద్యోతిత కుట్టిమం బితర దు । ష్ప్రాపంబు పౌలస్త్య శ్రీ
లావిక్రాంతి సఖంబు చూడు మదిగో । లంకాపురం బిమ్ములన్!

సుర రాజధానుల సృజియించిన పిదప నొచ్చెము లేని శిల్పనైపుణితో విశ్వకర్మ దీని వెలయించె నని వినుతింతురు.

సీత—ఎంత సిరి యున్న నేమి? గరాసుల మూలమున బీభత్సమైనది.

రాము—అవు నదిగో! లంక కుత్తరముగా సువేలాద్రికిఁ బశ్చిమమునం జూడుము! నీకై యనిసేయు కపి క్రవ్యాదుల గాత్ర గోత్రములనుండి ప్రవహించిన రుధిరాపగలవి.

మ. తరుసందోహము గాఁగ యోధులకబం । ధంబుల్; విసారంబులై
తరవారుల్ పొడసూప; ఫేనముల చం । దంబొంద నుష్ణీషముల్
శిరముల్ పక్షులుగాఁగ; హస్తులు వి । శేషింపన్ శిలల్ వోలె మీ
ఱి; రథంబుల్ తెగునోడ్లుగా వఱద వా । ఱెఁ, రక్తకల్లోలినుల్.

సీత—ఇందేనా ఫణి పాశములతో నా నిమిత్తము మీరు గట్టఁబడితిరి?

రాము—అవును!

సీ. ఫణిపాశములతోడ । బంధించె నిచ్చోట
రావణి యర్ధ రా । త్రమున మమ్ము



వాని మహావీరు । వాసవారి నసాధ్యు
సౌమిత్రి యిచ్చట । సంహరించె
మయుఁడు సేసిన చిచ్చు । మయమైన పెను శక్తి
చే లక్ష్మణుడును మూ । ర్ఛిల్లె నిచట
సంజీవినిం దెచ్చి । సామీరి యిచ్చోట
జగములఁ జేసె ని । శ్శల్యములను

గీ. మొగులు ముట్టిన మూర్ధంబు । మోసపోయి
కుంభకర్ణుని మొండెము । కూలె నిచ్చోటఁ
గైకసేయుని నిశితాంబ । కములతోడఁ
గంఠముల నఱుమాడె ని । క్కడ నొకండు.

సీత—(చిఱునగవుతో) కైకసేయుని కంఠముల నఱుమాడిన మహావీరుల నటుండ నిండు! కిష్కింధేశ్వర స్కంధావారైకధురీణుఁడును రఘుకుల కుటుంబ విధుర బంధుఁడు నగు హనుమయేఁడీ?

రాము—భరతునితో మన రాకఁ జెప్పుట కయోధ్యకుఁ బంపితి.

సీత—మనకుమాత్ర మాలస్య మెందులకు?

రాము—(విమాన వేగము నటింపఁజేసి) పార్థివీ! పారావారమిది.

శా. తారా కాంతుఁడు కౌస్తుభంబు సుధ । చింతారత్న ధన్వంతరుల్
శ్రీరామామణి కామధేనువు ఘృతా । చీ మేనకామంజుఘో
షారంభాదులుఁ గల్పవృక్షములు ను । చ్చైఃకర్ణ మశ్వంబు నీ
పారావార పయో వివర్తములు సం । భావింప భవ్యాననా!

మఱియు

గీ. నీరజోదరునకు శయ్య । నీయ గృహము
నీరదాధ్వనీనులకుఁ బా । నీయ శాల

ధరణికి మణి మేఖల పవి । త్రస్త గిరుల
కభయ దుర్గముఁ జుమ్మి యి । య్యర్ణవంబు.

సీత—కడలి నడుమ లంకాద్వీప పోతమునకు గట్టిన గొలుసువలె దీర్ఘమై తోఁచు నది యేమి?

రాము—కపి సార్వభౌముని కీర్తి మూర్తి యది మహాసేతువు.

సీత—(ఆనందముతో నమస్కరించు.)

రాము—విమానారూఢులమై నభోమండలమున నుండుటం జేసి మహీమండలము సర్వము చూపట్టెడు.

సీత—పూర్వాపరార్ణవములం జొచ్చి భూమికి మానదండము వలె నున్న యయ్యిలాధర మెయ్యది?

విభీషణుఁడు—అమ్మా! అది హిమాలయము.

సీ. గోరూప ధరయైన । క్షోణి రత్న క్షీర
ముల నిమ్మ హిమధరం । బునకుఁ జేఁపె
నాక సోపానాళి । నా నీ నగమునందు
భువనైక పావని । పుట్టె గంగ
అర్థనారీశ్వరుం । డయ్యెఁ దా నొయ్యని
య్యచలంబునందు న । య్యష్టమూర్తి
జాయా సమేతులై । చనుదెంచి విహరింతు(రి)
వేల్పు లీ గిరి సాను । వేదులందు

గీ. మఱియు నీ శైలమున దృష । న్మందిరముల
సంభృతావాస మగు వన । చర కుటుంబ
ములకుఁ దైల పూరము లేని । భూరి దీప
ములు మహౌషధు లవి యెల్ల । పుడును నిశల.

రాము—ఇందే యిందుశేఖరుని నయనానలమున మన్మథుఁ డాహుతి యయ్యె.



విభీ—అవును!

మ. రతి తాఁ బెంచిన పూవుఁదీవ లవి; తో । రంపైన సంపత్తి న
ప్రతిమంబై తనరెన్ వసంతుని హజా । రంబిచ్చటం; గోయిలల్
శ్రుతిపేయంబుగఁ బాడు నేఁడును; బిడౌ । జుం డంప నిచ్చోట నూ
ర్జితుఁడై మారుఁడు పంచబాణికి భవుం । జేసెన్ మహాలక్ష్యమున్.

రాము—మలయాచల మిది.

శా. తావుల్ నిక్కఁ జూత శాఖలమహో । త్సాహంబుతో నూఁపుచుం
(దోవల్ మోరి)యఁ గనద్దెసంబర భృత । (త్రోటీపుటుల్ విప్పుచుం
బూవుంబోఁడులకున్ వివర్ధిత మనో । భూ కేళి భావంబులై
యావల్లోకము మోహపెట్టు నదసీ । యంబుల్ మరుత్పోతముల్

సీత—వైతాన వైశ్వానర ధూమ వలభీ వలయిత దిక్కం బీ పుణ్యాశ్రమం బెవరిది?

రాము—

గీ. గట్టునం దేఁచె నెవ్వాఁడు । కఠిన దైత్యు
బుడిసిటం గ్రోలె నెవ్వాఁడు । పొంగునబ్ధి
నడఁచె నెవ్వాఁడు మఱియు విం । ధ్యాద్రి పొడవు
నయ్యగస్త్యేశ్వరునిది యీ । యాశ్రమంబు.

సీత—అమ్మహానుభావునకు సుంత సూచించిన సేతు నిర్మితికి మీ కింత శ్రమ ముండదు.

రాము—ద్రవిడదేశ మిది.

శా. ఏలా జాజి లవంగ పూగములతో । నింపారి సుస్నిగ్ధ తాం
బూలీ చందన సౌరభ ప్రభలతోఁ । బొల్పొంది యెంతేనియుం
త్రైలోక్యప్రథమానుఁడై పరగు చే । తస్స్ఫూర్తికిం గామ్యమా
లీలా సౌధము నాఁగ శోభలఁ బిసా । ళించుం గదుర్వ్యాద్యమై.

సుగ్రీ—దండకారణ్యభాగములివి; దేవరమూలమున నిందల తపోధను
లిపుడు సుఖమున్నారు.

రాము—విమానవేగమున మనమిప్పుడు హిరణ్యహారిణ విహార
భూములపై నుంటిమి.

సుగ్రీ—మారీచుని బలియిచ్చి నిజ శరీరము నిగూఢముం జేసికొన్న
దశకంఠుని కపట భిక్షు విడంబ నాడంబరైక సాక్షి యగు
పంచవటి యిది.

శా. చిత్రైణాకృతితోడ వల్లభ ముఖ । శ్రీనుండియున్ జానకీ
నేత్రాంభోజములన్ మరల్చి తవురా । నీ ప్రజ్ఞ మారీచ! మా
యాత్రాణైక ధురీణ నీ కతన దై । త్యశ్రేణిపై నంశుమ
ద్గోత్రస్వామియు రెండుమార్లు గొనియెం।గోదండమున్ సజ్యమున్

లక్ష్మ—(తిలకించి)

మ. అదె గోదావరి! తీర దేశములయం । దభ్రంలిహాగ్రంబులౌ
కదళీకాండము లామ్రవృక్షములు పోఁ । కల్ నారికేళంబులున్
మది నుత్సాహముఁ బెంచు;బంభరములున్।మత్తాన్యపుష్టంబులున్
సదనోత్కంఠులఁ జేసిపుచ్చు నిజ ని । స్వానంబులం బాంథులన్.

రాము—(కుడివైపుఁ జూపుచు) ఇవ్వేలుపు

సీ. అబ్ధి సంభవమైన । హాలాహలం బెల్ల
మిసిమింతుఁడును గాక । మ్రింగినాఁడు
క్షణములో బిసరుహా । సను కంఠ నాళంబు
తూఁటికాఁడం బోలెఁ । ద్రుంచినాఁడు
చొప్పకసుంబోలెఁ । జుఱచుఱ నయనాగ్ని
గిరివిల్తు బూది గా । వించినాఁడు



మృత్యుదేవత నోటి । మెఱుఁగు కోఱలు రాల
దట్టించి యఱకాలఁ । దన్నినాఁడు

గీ. త్రిపుర దైత్యావరోధ నా । రీ కదంబ
సాంద్ర సౌభాగ్యమున కెగ్గు । సలిపినాఁడు
నతశరణ్యుండు దేవతా । నాయకులకు
నేఁడుగడ విశ్వభర్త భీ । మేశ్వరుండు.

(భక్తితో)

శా. చక్షుశ్శ్రోత్రి సువర్ణకుండలుఁడు సా । క్షాద్విష్ణు వేధస్సహ
స్రాక్షాది త్రిదశార్చితుండు సదయుం । డామ్నాయ సంవేద్యుఁడీ
దక్షారామ పురాధినాయకుఁడు ని । ర్ద్వంద్వుండు కైవల్య స
ద్భిక్షాదాత మహానుభావుఁడు మమున్ । భీమేశ్వరుం డోమెడున్!

సీత—(పడమటిదెసం జూపుచు) శృంగారశ్రీ కమలమువలె విలసిల్లు
నది యే నగరము?

రాము—ఉజ్జయినీపురము—అందు

సీ. పంకజామోద సం । పర్క కషాయంబు
లై వీచు శిప్రాప । గానిలములు
సంతత కేశ సం । స్కార ధూపోపచి
తంబులై నిండు న । భ్రములు చదల
విపణి వీథుల నాఱ । విప్పిన పచ్చ కెం
పుల సంజ కెంజాయ । పొంగిపొరలు
మధుర వాణుల మ్రోల । మసలి యాడు చకోరి
ధూయంచు నుమియుఁ జం । ద్రుని కరంబు

గీ. ధౌత సౌధములం గల । ధౌత పంజ
రములయందున్న కేళి కీ । రంబు లెల్ల

ఘన మనీషులు మెచ్చ శృంగార సార
వాదములు సేయు నాత్మ విద్వత్తఁ జూపి.

లక్ష్మ—చేరువకు వచ్చితిమి.

క. గంగా యమునా తటినీ
సంగమ మిది పావనంబు సంసారపుఁద్రా
టం గట్టువడక యిట ము
క్తిం గాంతురు తీర్థరతులు కృత మజ్జనులై.

మఱియు

శా. ఉన్నిద్రాంబుజ వాటికా చర దళి వ్యూహంబు పుణ్యాశయా
సన్నస్నాత వధూ విధూత కబరీ శైవాలితం బాశ్రితా
పన్నిర్వాపణ మాదితేయ ముని సంభావ్యంబు కల్యాణ సం
పన్నిక్షేపము తద్దయుం ద్రిపథగాంభఃపూర మొప్పారెడున్.

(భక్తితో)

శా. శ్రీకంఠప్రభు రాజధాని రజతాద్రిస్పర్ధిహర్మ్యంబు గం
గాకల్లోలవతీపవిత్రితజగత్కాండంబు తత్తత్సువి
ద్యాకల్పద్రుమ ముర్వరా పరిధి మధ్యస్వర్గఖండంబు మో
క్షైకద్వారము కాశికా పురము చిత్తామోదముం జేసెడిన్!

రాము—(వేలితోఁ జూపుచు) అది మిథిల.

సీత—(సానురాగముగ వీక్షించి) అమ్మా! వందనము! గురుజనమునకు నా వందనములం దెలుపుము!

రాము—(సుగ్రీవ విభీషణులతో)

క. వేదాంత విభవ శేవధి
భూదేవికిఁ బురిటియిల్లు పుణ్యైకశ్రీ
కేదారము మఱియును నిమి
భూదయితాగ్రసరులేలు ప్రోలిది వెలయున్



సుగ్రీ—దేవర కాత్యాయనీ కమన కార్ముకమును విఱిచినదియిక్కడనే!

విభీ—తదంతేవాసింగూడ—

రాము—(చిఱునగవుతో సిగ్గు నభినయించును.)

సీత—మహోదధిని దాటిన మారుతికంటెను బ్రజవితములై నా కన్నులయోధ్యం గనుచున్నవి.

(హనుమంతుఁడు ప్రవేశించును.)

హను—(నమస్కరించి) కులగురువులు వసిష్ఠులు నా వలన మీ రాక విని పట్టాభిషేకాయత్త చిత్తులై భరతశత్రుఘ్నులతోఁ బ్రతీక్షించుచున్నారు.

రాము—

క. సరయూ తరంగ రేఖా
తరళద్యుతి ధగధగాయితము భాను కులా
భరణులు పరిపాలించెడు
పుర మియ్యది మా యయోధ్య పొలుపొందఁ గడున్!

(అందఱును నమస్కరింతురు)

రాము—వారు వసిష్ఠాదులు! విమానమును దిగుదము!

(అందఱును విమానావతరణము నటింతురు)

(వసిష్ఠాదులు ప్రవేశింతురు)

వసి—(రామునిఁ జూచి ఆనందముతో)

గీ. అంశుమద్వంశ మండనుఁ డమర వంద్యుఁ
డింద్ర నీలోపల స్నిగ్ధుఁ డిషు విలూన
రాక్షసేంద్రుఁడు విమల వర్తనుఁడు మిగులఁ
బ్రమద మొదవించు మనరామభద్రుఁ డితఁడు.

రాము—(వసిష్ఠులకు నమస్కరించు.)

వసి—(కౌఁగిలించుకొని) నాయనా! రామభద్ర! జగదానందధారే
యుల సూర్యచంద్రులవంటి సుతుల నిర్వురఁ గనుము!

సీత—(నమస్కరించు.)

వసి—అమ్మా! జానకి! ఈ మా యాశీర్వచనము మీ కిరువురకు
నొకటియే.

సీత—(తనలో) ఆర్యపుత్రునకు నా గృహిణీత్వము నిస్సాపత్న్యము.

లక్ష్మ—(నమస్కరించు.)

వసి—వత్సా! లక్ష్మణ! ఆశీర్వచనమును మీకే యుంటివి. అన్న
దమ్ము లందఱు మీ రిద్దరిద్దఱ సుతులం గనుఁడు! రఘుకుల
సురమహీజ మష్టశాఖమై వర్ధిల్లు!

భరతుఁడు—(రాముం గూర్చి) ఆర్యపాదుకా భృత్యుఁడు భరతుఁడు
ప్రణమిల్లుచున్నాఁడు.

రాము—(కౌఁగిలించుకొని)

క. ఇందూపల నిష్యందము
మందార ప్రసవ గుచ్ఛ మకరందము సే
చందంబుఁ గాని నిబిడా
నందము భ్రాతృ పరిరంభణము గావించున్.

భర—(సీతకు నమస్కరించు.)

సీత—కుమారా! మోముఁ బయికెత్తి కమలానందముఁ గావింపుము!

లక్ష్మ—(భరతునకు మ్రొక్కుచున్నాఁడు.)

భర—(కౌఁగిలించికొని) యూప స్తంభమువోని లక్ష్మణ బాహా
దండముచేఁ జిరకాలమునకు శీతలీకృతుఁడ నయితి.

శత్రుఘ్నుఁడు—(రామునికి నమస్కరించు.)

రాము—(కవుఁగిలించుకొని) ఇందుకలా కలాపమువలెఁ జల్లనయి
నా యనుజన్ముల బాహా లన్నియు నొక్కచందమున సౌఖ్యా



వహాములు. (సీతకుఁ జూపుచు) చంద్ర బింబోని మో
మును గరికరంబులువోని కరంబులు నివి యచ్చముగా
లక్ష్మణునివి.

శత్రు—(సీతకు నమస్కరించు.)

సీత—ముల్లోకముల శల్య ముద్ధరించు చరితంబుల లక్ష్మణుంబో
లుము! వత్సా! శత్రుఘ్న! అత్త లెచ్చట ?

శత్రు—మంగళోపచారములతో మధ్యమాంబ యింట మీకై నిరీ
క్షించుచున్నారు. (లక్ష్మణునికి మ్రొక్కు)

లక్ష్మ—(కౌగిలించికొని) తమ్ముఁడా! దీర్ఘాయుష్మంతుఁడవై వెలయు
నీ కతమున నన్న భరతు నేకాకిం జేసి చన్న వాఁడం గానయితి.

రాము—(మునింగూర్చి) లంకా కిష్కింధాధిపతులు వీరు విభీషణ
సుగ్రీవులు నమస్కరించుచున్నారు.

వసి—వీరు చిరకాలము పులస్త్యార్క కుల కీర్తి తోరణ స్తంభము
లవుదురుగాక !

రాము—(భరతునితో) తమ్ముఁడా! యీ పౌలస్త్య సావిత్రులమహా
త్ముల నమస్కరింపుము!

(భరత శత్రుఘ్నులు విభీషణ సుగ్రీవులు)
(యథోచితముగా వర్తింతురు.)

వసి—మరలఁ బదునాలుగేండ్ల కిపు డభివృద్ధి నొందుచున్న దశరథ
కుటుంబముం జూచుచున్నాము. (రాముంగూర్చి) వత్సా!
సుముహూర్తము మించుఁ గావున రఘుసింహుల సింహాసన
మది యధిరోహింపుము!

రాము—(అటు లొనర్చు.)

వసి—(మంత్రములతో నభిషేకించు.)

(అందఱును నమస్కరింతురు.)

(తెరలో మంగళ ధ్వని)

(ఆకసమున)

గీ. శివు నుపాసించి శ్రీదుఁ డా । ర్జించుకొని యెఁ
బుష్పకము; బల్మి వింశతి । భుజుఁడు గొనియె
నదియు నిప్పుడు నీవశ । మయ్యె మరల
దాని దయసేయు మిన కులో । త్తంస! దేవ!

వసి—ధనదుఁడు యాచించుచున్నాఁడు.

రాము—విమానరాజా! నీ ప్రథమ స్వామి యగు వైశ్రవణునింజేరుము!

(పైకిఁజూచి) అనినంతనే విమాన మాకసమునకుం జన్నది.

వసి—(హర్ష ప్రసాదములతో) రామభద్ర! యింతకంటె నాశాస్య మేమి యుండు నీకు?

సీ. తాతాజ్ఞ మాళిర । త్నముఁబోలె ధరియించి
వేడ్కమైఁ జనితీవు । విపినమునకు
భరతుఁ డద్భుత గుణ । పాత్రుఁడై చేయించెఁ
బాదుకా ద్వయముచేఁ । బాలనంబు
సౌమిత్రి గెడపె ని । ర్జర బాణ వృష్టి క
వగ్రహంబైన రా । వణి నసాధ్యుఁ
జేదామరలు మోడ్చి । జేజేలు వాగడంగ
వైదేహి చను దెంచె । వహ్నిఁ జొచ్చి
రూపుమాసిరి దేవతా । రులు దిగంత
ములు దశాస్య తమఃపరి । ముక్తములయి
శోభితము లయ్యె మీ యశ । స్సోమ కళల
నవ్య మది జగములకు నా । నంద మయ్యె.
అయిన నిట్లవుగాక!



సీ. చరియింత్రుగాక! సీ । చందాన ధర్మైక
రతా ధురీణులై । రాజసుతులు
భజియింత్రుగాక! ని । ర్భర భక్తి వైదేహి
పగిది విశుద్ధలై । పతుల సతులు
యజియింత్రుగాక! తా । రబ్జగర్భుని పోల్కి
నామ్నాయ విజ్ఞులై । యవనిసురులు
వర్షించుఁగాక! ది । గ్వారణంబుల మాడ్కి
నిండు ధారా వృష్టి । నీరదములు

గీ. భూమి సస్యాఢ్య యగుఁగాక । పుష్పిత సుర
పాదపము భాతి! జగదేక । పావని యయి
మఱియు నాచంద్ర తారార్క । మండలంబు
విష్ణుపదిభంగి నీ కృతి । వెలయుఁగాక!

(అందఱును నిష్క్రమింతురు.)

---

మ. సుగుణశ్రీ నిధియైన జోగమకు న । స్తోకప్రభంబౌ నిదం
జగదానంద కృతిప్రభావమున నా । చంద్రార్కమున్ దిక్కులన్
నెగడుంగావుతఁ గీర్తిచంద్రికలు ని । ర్నిద్రంబులై ప్రోల్లస
ద్గగనద్వీపవతీ తరంగములపైఁ । గాల్ద్రవ్వుచున్ శోభలన్!

శా. ఆనందంబగు! సంప్రమోదమగు! సౌ । ఖ్యంబౌ! సదారోగ్యమౌ
జ్ఞానంబయ్యెడు! భక్తియయ్యెడును! మో । క్షంబయ్యెడుంగాక! బ్ర
హ్మానందాకర మీ పవిత్ర కృతి మా । హాత్మ్యంబుచే దేవతా
సూనాంగుల్ వినుతింప నిచ్చలును మా । జోగమ్మకున్ సాధ్వికిన్!

సీ. ఆకాశ మది మూర్ధ । మంతరిక్షము నాభి
వసుమతి పాదమై । వరలువాఁడు

నిశ్వాస పవనంబు । నిగమత్రయము గాఁగ
జగమెల్ల మూర్తియై । జరగువాఁడు
హృదయమై రోహిణీ । హృదయేశుఁ డెనలారఁ
గమలాప్తుఁ డక్షియై । క్రాలువాఁడు
తాను సర్వంబునై । తనయందు సర్వమై
యర్వాక్పరాగ్రూపుఁ । డయినవాఁడు
గీ. వాక్కునకు డెందమునకును । వశముగాని
వాఁడు శ్రీపరబ్రహ్మ సు । వ్రతకు భర్త
తత్పరకు జోగమకు విశు । ద్ధ గుణవతికి
సదయుఁడై మోక్షలక్ష్మి నొ । సంగుఁగాత!.

ఇది

శ్రీ బ్రహ్మానంద విరచితము జగదానందము.

సప్తమాఙ్కము.

నాటకము సంపూర్ణము.



# సరసానందము

ఇయ్యది 1928 సం॥ మే నెలలో వెలువడును.

ఈ జగదానందము దక్కఁ దక్కటివి యేవియును ఇంతకుఁ బూర్వము నేను రచించి ముద్రించినవి ఉత్తరరామచరితము, అభినవ మోహనము, మున్నగునవి పునర్ముద్రణ మగువఱకును దొరకవు. వలయువా రందనుక మన్నింతురుగాత!

ద్వివేది బ్రహ్మానందశాస్త్రి,
తు ని.

---

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 9 | 5 | పుష్టిత | పుష్పిత |
| 16 | 9 | కష్టము | కృష్ణము |
| ,, | 11 | సరిదీన | సరిదీశాన |
| ,, | 7 | మెధిలీ | మైధిలీ |
| 22 | 14 | చాతము | చాపము |
| 19 | 11 | వాం | వాళఁ |
| 73 | 12 | దయ | కృప |
| 62 | 24 | వాని | వాలి |

# జగదానందము

వి. పి. ఖర్చులుగాక　　　　　దీని వెల రూ 0—10—0.

వలయువారు:—ఈ క్రింది చిరునామాకు వ్రాసికొనుఁడు.

ద్వివేది బ్రహ్మానంద శాస్త్రి,

తుని—TUNI

తూర్పుగోదావ జిల్లా





